# నవశక్తి

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ పత్రిక

సంపాదకుడు : మద్దూరి అన్నపూర్ణయ్య

సంపాదకవర్గం

కంభంపాటి సత్యనారాయణ. పుచ్చలపల్లి సుందరయ్య.

చుమ్మల వెంకట రామయ్య. మద్దుకూరి చంద్రశేఖరరావు.

సంపుటం 1 | బుధవారము 17—8—38 బెజవాడ | సంచిక 34


ధర్మకర్తలు




## THE TRUSTEES

[ఏదో స్పర్థ ఉందనుకొంటున్న రెండు వర్గాలు పరస్పరం ఒకదానిమీద ఒకటి ఆధారపడి ఉండాలి అనే విషయం గ్రహించడంలోనే పరివర్తనం యొక్క అందం ఉన్నది. రెండు వర్గాలు పరస్పరం ఆధారపడి యుండాలి.—(హరిజన్: 1938 ఫిబ్రవరి, 2.)]

కాని, గొర్రెలు, మేకల లాగా ఉండే హిందూ దేశ రైతాంగానికి, పులులు, తోడేళ్లు, మొసళ్లు లాగా ఉన్న పెట్టుబడిదారీ, సంస్థానాధీశ్వర, జమీందారీ వరాలకూ సామరస్యం ఎలా సంభవం? పీడించే వారు పీడితులకు ధర్మకర్తలయితే ఎలా?

# నవశక్తి

చందా వివరాలు

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ 3—0—0 |
| అర్ధసంవత్సర చందా | 1—10—0 |
| విడిప్రతి | 0—1—0 |

* * *

అడ్వర్టైజుమెంటు రేటులు

"కాలం" వెడల్పు 2" (2 అంగుళాలు)
కాలంలో 1" మొదలు 20" వరకు ప్రతి అంగుళానికి రూ. 0—6—0

| | |
|---|---|
| 20" — 100" వరకు ,, | 0—4—0 |
| 100" పైగా ,, | 0—3—0 |
| పాతిక పేజీకి | 3—0—0 |
| సగము పేజీకి | 6—0—0 |
| ఒక పేజీ మొదలు 15 పేజీల వరకు పేజీ ఒకటికి | 10—0—0 |
| 15 పేజీలకు పైగా పేజీ 1కి | 7—8—0 |

ఈ వరకు అంగీకరించిన కంట్రాక్టులకు ఈ రేట్లు వర్తించవు.

ఈ రేట్లలో కన్సెషన్సు, కమిషను ఏమీ ఉండవు.

* * *

చందాదారులను చేర్పించారి!

గత మాసపు 'కోటా' అందరూ పూర్తిచేయలేదు.

ఆగస్టులో ఈ క్రింది విధంగా చేర్పించాలని క్రొత్తగా మరో లిస్టు నిస్తున్నాం. ఈ "కోటా"లు పూర్తి అయేటట్లు పార్టీ సభ్యులు, సోషలిస్టు అభిమానులు, ప్రజా సామాన్యము పని చేస్తారని ఆశిస్తున్నాం.

ముఖ్యంగా పార్టీ సభ్యులు గత మాసం కంటె తీవ్రంగా పనిచేసి 'కోటా' పూర్తి చేస్తారని నమ్ముతున్నాం.

| | ఆగస్టు నెల కోటా | చేర్పించినవి |
|---|---|---|
| విశాఖపట్టణము | 15 | 3 |
| తూ. గోదావరి | 100 | 4 |
| ప. గోదావరి | 200 | 4 |
| కృష్ణా జిల్లా | 100 | 13 |
| గుంటూరు | 100 | 5 |
| నెల్లూరు | 60 | 0 |
| రాయలసీమ | 15 | 0 |
| ఇతర స్థలాలు | 10 | 3 |
| | 600 | 32 |

* * *

చందాదారులకు విజ్ఞప్తి.

కొంతమంది తాము మా ఏజెంట్లకు చందాడబ్బు ఇచ్చామనియు, పత్రిక రావడము లేదనియూ జాబులు వ్రాస్తున్నారు. మా ఏజెంట్లు విడిప్రతుల నమ్మడానికే మేము బాధ్యులము. వారికి చందా చెల్లించినవారు వారివద్ద నుండియే పత్రిక తీసికొనవలయును. లేదా ఆఫీసుకు తిన్నగా చందాను మనియార్డరు ద్వారాగాని లేక కాన్వాసింగు ఏజెంట్ల ద్వారాగాని పంపించవలయును. దీనిని అందరు గమనించ ప్రార్థన.

మా కాన్వాసింగు ఏజెంట్లు రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కార్యనిర్వాహక సభ్యులు, జిల్లా పార్టీల కార్యనిర్వాహక సభ్యులు, పట్టణ, తాలూకా పార్టీల కార్యదర్శులు.

# సంస్థానాలలో నిరంకుశ నిర్బంధ విధానాలు నృత్యం చేస్తున్నాయి.

తిరువాన్కూరు దుండగాలు—నీలగిరిలో కాల్పులు—
సికార్ రాజు ప్రకటన — నైజాం శిస్తు భారం.

## తిరువాన్కూరు.

తిరువాన్కూరు సంస్థానంలో నిర్బంధ విధానం నానాటికి పెచ్చుపెరిగి పోతోంది. 144 సెక్షను ప్రయోగాలు, పత్రికలను నిషేధించడం విద్యార్థులను సహితం లాఠీలతో కొట్టడం ఎక్కువైపోతున్నాయి. ఈమధ్యనే దేవికోలం జిల్లాలో కూడ ఏవిధమైన మీటింగులు, ఉపన్యాసాలు జరుపరాద దంటూ జిల్లా మేజస్ట్రేటు ఉత్తరువు ప్రకటించారు. దీనితో ఇంచు మించు తిరువాన్కూరు సంస్థానమంతటా ఈ నిషేధపు టాజ్ఞలు అమలులో నున్నాయన్న మాట.

ఈ ఆజ్ఞను రెండురోజుల క్రితమే సి. వి. శేఖర్ అనే ఆయనను త్రివేంద్రంలో ఆల్ తిరువాన్కూరు యువజన సంఘ యాజమాన్యాన జరిగిన మీటింగులో ఉపన్యసించరాదంటూ శాసించడం, ఆయన తిరస్కరించడం, అందుకుగాను త్రివేంద్రం మేజస్ట్రేటు గారు 15 రోజుల శిక్ష, రు 50 లు జరిమానా, చెల్లించనందున ఇంకోవారం అదనపు శిక్ష విధించడం జరిగాయి.

కొచ్చిన్‌లో ప్రచురింపబడుచున్న "దీపం" "ప్రకాశం" అనే పత్రికలు తిరువాన్కూరుకు తీసుక రాకూడదంటూ సంస్థాన ప్రభుత్వం ఇంకో ప్రకటన గావించింది. ఇదివరకే, తిరువాన్కూరు సంస్థానంలో ప్రచురింపబడే కొన్ని పత్రికలు ప్రభుత్వ నిషేధం మూలంగా ఆగిపోవలసి వచ్చింది. ఇపుడు, ఇతర చోట్లనుండి కూడా పత్రికలు సంస్థానంలోకి రాకూడదని శాసనం: ప్రజల పౌరస్వాతంత్ర్య హక్కులు ధ్వంసం చేయడానికితోడు, పత్రికలు చదువుకునే స్వాతంత్ర్యం కూడా లేకుండా చేస్తోంది ఈ "ఆదర్శ సంస్థానం"

### ఎసెంబ్లీ భాగవతం.

ఈ తిరువాన్కూరు స్టేట్ ఎసెంబ్లీలో దివాన్, సర్. సి. వి. రామస్వామయ్యంగారు, సంస్థాన ప్రభుత్వ కార్యదర్శి గోవింద పిళ్లెగార్ల ప్రవర్తన చూస్తే, భారత శాసన సభలో బ్రిటిష్ ప్రభుత్వ కార్యదర్శి, హోంమెంబర్ల సమాధానాలు కూడా మరపుకు వస్తాయి.

తిరువాన్కూరు సైన్సు కాలేజి విద్యార్థులు, డిసిప్లిన్‌కు వ్యతిరేకంగా,కి శాంతి భంగకరంగా ప్రవర్తించారని, రిజర్వు పోలీసు దళం వచ్చి లాఠీఛార్జీ చేసింది. ఈ విషయమై ఎసెంబ్లీలో చర్చించ వలసినదంటూ ఒక అడ్జర్నమెంటు ప్రతిపాదన వస్తే, అదేమంత అత్యవసర విషయం కాదని జవాబు చెప్పి, ప్రతిపాదన త్రోసివేశారు ప్రెశిడెంటు దివాన్.

### స్టేట్ కాంగ్రెస్ గూడుపుఠానీ సంఘమట!

తిరువాన్కూరు సంస్థాన కాంగ్రెస్‌ను, ప్రభుత్వం ఎందుకు గూడు పుఠానీ సంఘంగాను దౌర్జన్య సంఘంగాను ఎంచుతోందో ప్రకటిస్తూ, ప్రభుత్వ కార్యదర్శి గోవిందపిళ్లెగారీ క్రిందికారణాలు చెప్పారు. (1) స్టేట్ కాంగ్రెస్, ప్రభుత్వాన్ని సంస్థానంలోను బైటా కూడా అగౌరవ పరుస్తూ ప్రచారం చేస్తోందిట. (2) పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకిని దోచుకోడానికి ప్రయత్నించిందిట. (3) స్టేట్ కాం॥ వర్కింగు కమిటీ సభ్యు డొకాయన, ఒక ఉపన్యాసంలో, సంస్థాన "ప్రభుత్వం తానుచేసిన తప్పులను సవరించు కొనకపోతే రెండు మూడు నెలలలో (Non-violent) హింసారహిత తిరుగుబాటు వస్తుంద"ని చెప్పాడట.

అప్పు: ఎంతటి కారణాలు కనిపెట్టారు నేత్రశ్రీ!

ఇండ్లపై రాళ్లు రువ్వించి, విద్యార్థులను కొట్టించి, పత్రికలుకూడా రానీయకుండా చేస్తోంటే ఇవన్నీ పౌరసత్వ హక్కులకు భంగకరమైన పనులని అనడం, ప్రభుత్వాన్ని అగౌరవ పరచడమా?

ఇట్టి దారుణాలు చేస్తూంటె ప్రజలలో అసంతృప్తి హెచ్చి తిరుగుబాటు వస్తుందనడం కూడా తప్పేనా?

వీటన్నిటికంటె దారుణమైనది పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకును దోచ ప్రయత్నించారనడం. తిరువాన్కూరు స్టేట్ కాంగ్రెసు బాధ్యతా రహితమైనది కాదు. ఆలిండియా వర్కింగు కమిటీలోకూడ ఈ సంస్థాన కాంగ్రెసు నుండి ప్రాతినిధ్యం పొందిన సభ్యుడున్నాడు. భారత స్వాతంత్ర్య పోరాటంలో ఇంతవరకు కాంగ్రెసు బ్యాంకులను దోచుకోడానికి ప్రయత్నించిందని బ్రిటిషు ప్రభుత్వం కూడా ఆరోపించ లేదు. అటువంటిది, తిరువాన్కూరు సంస్థాన ప్రభుత్వ కార్యదర్శి ఈ చార్జీ తీసుకురావడం శోచనీయం. ఇవన్నీ చూస్తే నిర్బంధ విధానంలో సంస్థానాలన్నిటిలోను తిరువాన్కూరు "ఆదర్శ సంస్థాన" మే అనవలసి వస్తోంది.

ఈ సంస్థానంలోని విషయాలన్నీ గాంధిగారికి ఎప్పటి కప్పుడు తెలియ పరుస్తూనే వుంది. స్టేట్ కాంగ్రెసు. ఈ విషయమై ఆలిండియా వర్కింగు కమిటీ త్వరలోనే ఒక నిర్ణయానికి వస్తుందని గాంధిగారు ప్రకటించారు. వర్కింగు కమిటీ, మైసూర్ రాజీలాగ చేయకుండా, సంస్థానాలలోని స్వాతంత్ర్య పోరాటాన్నికూడా భారత స్వాతంత్ర్య పోరాటంలో మిళితంచేసే విధానం అవలంభిస్తే బాగుంటుంది.

## మైసూర్.

మైసూర్ సంస్కరణల సంఘానికి ఆదికర్ణాటక కమిటీ ఒక మెమొరాండం ఇచ్చింది. అందులో అస్పృశ్యతను శాసనం ద్వారా నిర్మూలింపజేయమనీ, ప్రత్యేక నామినేషన్లు రద్దుచేసి బహిరంగ ఎన్నికలు జరపమనీ, కోరికలున్నాయి. సెంట్రల్ మహమ్మదీయ సంఘం కూడా ఒక మెమొరాండం ఇచ్చింది వారి కోరికలు (1) ఎసెంబ్లీలో 13% సీట్లు తమకుండాలనీ, (2) నామినేషన్లు రద్దుచేసి టెరిటోరియల్ పద్ధతిని సీట్లు విభజించాలనీ, (3) ఫెడరల్ ఎసెంబ్లీలో తమకు 7 సీట్లు ఇవ్వాలనీ, ఇవిగాక ఎక్కువ ఉర్దూ పాఠశాలలు స్థాపించాలనీ కూడా ఉంది.

ప్రజలీ విధంగా తమకు కావలసిన హక్కుల కొరకు గోల పెడుతుంటే మైసూర్ సిటీలో మీటింగులు జరుపకూడదంటూ ఇదివరలో వేసిన 144 సెక్షను, ఇంకొక 6 నెలలకు పొడిగించింది ప్రభుత్వం. కాంగ్రెసు తోచేసికొన్న రాజీ షరతులకు వ్యతిరేకమని మైసూర్ కాంగ్రెసు కమిటీ తీర్మానంకూడా చేసింది.

ఈ గోరుచుట్టుమీద దివాన్ సర్ మీర్జా ఇస్మాయిల్ గారింకొక రోకటి పోటు ప్రసాదించారు. భారత రేడియోలో, మైసూర్ భూతల స్వర్గమంటూ దీర్ఘోపన్యాసం దంచారు. ఇంకేముంది ప్రపంచమంతా మైసూర్ భూతల స్వర్గం అనుకుంటుందన్న వారి ఆశ. కాని విదురాశ్వద్ధం విచారణ సరిగా గమనించే వారికి మైసూరు బండారం తెలియక మానదు.

## జపాను వస్తువుల బహిష్కరించండి!

BOYCOTT JAP MADE GOODS

"జపాను వస్తువుకొంటే, జపాను బాంబును చైనాపై వేసినట్టే" అను అభిప్రాయాన్ని తెలిపే ఈ చిత్రాన్ని కెంటు యూనివర్సిటీలోని ఒక విద్యార్థిని ప్రదర్శించుచున్నది. ఇంగ్లండులోని అమెరికన్ విద్యార్థి సంఘాలు ఇలాంటి చిత్రాలను చాలా ప్రదర్శించి జపాను వస్తు బహిష్కరణ ఉద్యమాన్ని వృద్ధిపరచు చున్నాయి.

## నీలగిరి.

### ప్రజలపై తుపాకులు.

నీలగిరి సంస్థానంలో సాగుతూన్న సత్యాగ్రహోద్యమం ఆగలేదు. ఈ మధ్య రాజీ అంటూ కొంత తతంగం జరిగింది, గాని సంస్థానాధీశులు అదేమీ లెక్కచేసినట్లు లేదు. రాజీ రాయబారాలు జరుగుతూండగానే ప్రజామండలి కార్యదర్శి బాబు జనార్దన్‌దాస్‌ను అరెస్టుచేశారు. ఈ ప్రజోద్యమాన్ని అణచడానికి సాయుధ పోలీసు సహాయం పంపమని ఒరిస్సా ప్రభుత్వాన్ని అడిగారు. కాని వారు నిరాకరించారు.

ఇవన్నీ ప్రజలలో ఉద్రేకాన్ని మరింత రెచ్చగొట్టాయి. వేలకొలది ప్రజలు సత్యాగ్రహానికి తయారయారు. అనాది జాతులవారు కూడ చాలమంది పాల్గొన్నారు. మొన్న 13 వ తేదీని పోలీసులు 1000 మంది ఊరేగింపుపై తుపాకులు కాల్చారు. 15 గురకు తీవ్రగాయాలు తగిలాయి. ఒక శవం సత్తా దొరకనేలేదు

## సికార్

### వింత ప్రకటన.

ఈమధ్య చెలరేగి చల్లారిన సికార్ తిరుగుబాటును గురించి జయపూర్ సంస్థాన పబ్లిసిటీ డైరెక్టరు ఒక వింత ప్రకటన గావించారు. సికార్‌తో, ప్రజలు రాజపుత్రులు తిరుగుబాటుకు సిద్ధమవడానికి, సికార్ రాజే కారకుడనీ, వారు తిరుగుబాటు విరమించుకోడానికి కూడా ఆయన అనుమతి పొందారనీ, కామన్సు సభలోని ప్రశ్నోత్తరాలనుబట్టి తనకు పైనుండి సహాయంరాదని నిస్పృహ జెంది సికార్‌రాజు రాజీకి ఒడబడ్డాడనీ ఆ ప్రకటన. కాని సికార్ రాజు అవన్నీ అబద్ధమని. అందుకు తగిన డాక్యుమెంటరీ సాక్ష్యం ఇదివరకే తాను చూపించి వున్నాననీ తనను అప్రతిష్టపాలు చేయడానికే ఆ ప్రకటన చేయబడిందని తానొక ప్రకటన జేశారు. రాజీ చేయడానికి వెళ్ళిన బజాజ్‌గారి ఉత్తరాలు, టెలిగ్రాములు అజామత్ చేసిన జయపూర్ అధికారులు ఇట్టిది ప్రకటించారంటే ఆశ్చర్యపడ నవసరం లేదు

## నైజాం.

నైజాంలో శాయిరీ వసూళ్ళు మిక్కిలి ఘోరంగా ఉన్నాయి. ఏదైనా బస్తీలో సరుకులు కొన్న గ్రామస్థుడు ఆ దుకాణదారు వద్ద సరుకుల పట్టీ తీసుకొని కరణం వద్దకు పోవాలి. అక్కడ మామూలు 0-4-0 రుసుము చెల్లిస్తే కరణం పట్టీపై సంతకము పెట్టి శాయిరీ ఆఫీసుకు పంపుతారు. అక్కడకు పోయి మళ్ళీ అక్కడ రుసుము చెల్లించుకొని ప్యాసు తీసుకొని నాకాకు వెళ్ళాలి. 415 గ్రామాలకు కల్పి ఈ నాకా వుంటుంది. ఆ గ్రామస్థుడు తన గ్రామాని కెంతదూరంలోవున్నా ఆ నాకాకు వెళ్ళి ప్యాసుచూపించి, మళ్ళీ రుసుము చెల్లించుకొని అప్పుడు స్వంత గ్రామం తీసుకొనిపోవాలి. ఈ బాధలేక సాధారణంగా శాయిరీ ఉద్యోగస్తులకు లంచాలిచ్చి సరాసరి తమ గ్రామాలకే పోతూవుంటారు ప్రజలు.

నైజాంలో, ఎక్కువ చలామణీ అయ్యేది బండి రూపాయలు. హాళీ రూపాయల చలామణీ చాలా గ్రామాలలో తక్కువ. కాబట్టి ప్రభుత్వానికి శిస్తులు చెల్లించవలసి వచ్చినా, బస్తీలలో సరుకులు కొనుక్కొన వలసినా బండీలను హాళీలలోకి మార్చుకొను నపుడు మారకం రూపాయికి 0-0-3, 0-0-6 చొ॥న యివ్వవలసి వస్తోంది. ఈ విధంగా కొన్నిసార్లు మారకం జరిగేటప్పటికి రూపాయి మాయమైపోతుంది. దీనివల్ల షరాబులు దోచుకొనుటే కాకుండా రైతులు మిక్కిలి నష్టపడుతున్నారు.

# నవశక్తి

17—8—38 బుధవారం

## కమ్యూనిస్టులు-కాంగ్రెసు ప్రభుత్వాలు

కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించాలని, దేశములో సామ్రాజ్య వాద వ్యతిరేక శక్తులన్నీ తీవ్రమైన ఆందోళన చేస్తున్న రోజులివి. ఇటీవలనే మార్చి 20 వ తేదీన కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించాలని దేశమంతటా సభలు జరిపి చేసిన ఆందోళన మనమింకా మరచిపోలేము. ఆనాడు సుప్రసిద్ధులగు కాంగ్రెసు వాదులెందరో, కాంగ్రెస్, ఎం. యల్. ఏ. లు సైతము ఎందరో, నిషేధము తొలగింపుడని విజ్ఞప్తి చేశారు. వర్కింగు కమిటీ సభ్యురాలు సరోజినీ నాయుడు కమ్యూనిస్టు పార్టీపై నిషేధము తొలగించవలెనని కోరినది. ఇలాంటి సమయంలో మద్రాసు ప్రభుత్వ ప్రచురణ శాఖా మంత్రిగారి కమ్యూనిస్టులపై దురాభిప్రాయం గలిగించే ప్రచురణ వెలువడింది.

కాన్పూరు యజమానులు కమ్యూనిస్టు ప్రచారాన్ని అరికట్టుట ప్రభుత్వం యొక్క కర్తవ్యమని ఒత్తిడి చేస్తే, యు. పి. ప్రధాని గోవిందవల్లభ పంతు బ్రిటిష్ పార్లమెంటు ఎన్నికలలో కమ్యూనిస్టు పార్టీ బహిరంగముగా ప్రచారము చేసి పోటీ చేయుచున్నదనియు, ప్రతి రాజకీయ కక్షియు తన ప్రచారమును నిరాఘాటముగా కొనసాగించుటకు హక్కు గల్గియున్నదనియు సెలవిచ్చాడు. కాని మద్రాసు కాంగ్రెసు ప్రభుత్వమువారు కమ్యూనిస్టు పార్టీయొక్క కరపత్రములు కొన్ని తమకు లభించినవనిన్ని, అందు "అశాంతి, అరాజకము" ప్రోత్సహింప బడినవనీ, ప్రజలు కమ్యూనిస్టు పెనుభూతమునకు వశముకాకుండ మెలకువగా నుండ వలెనని హెచ్చరించారు.

ఈ సందర్భములో కొన్ని ముఖ్య సమస్య లుదయించు చున్నాయి. ఇండియాలో కమ్యూనిస్టు పార్టీ నిషేధించ బడింది. అందుచే దానియొక్క ప్రకటనలేమియు బహిరంగముగా లేవు. అది రహస్యంగా పని చేస్తుందంటారా, ఆ పార్టీ ప్రకటన లివియని నిరూపించుటెట్లు? మదరాసు ప్రభుత్వమువారి వద్ద కొన్ని కమ్యూనిస్టు పత్రికలున్న సంగతిని మేము శంకించుట లేదు. కాని అవి కమ్యూనిస్టు పార్టీ చేతనే ప్రకటింప బడినవని నిర్ధారణ చేయుటకు ఆధారము లెవ్వి? ఎవరో ఒక ఆశాట రాసిన్న పంచాంగాన్ని త్రిప్పి, కరపత్ర రూపంగా విప్పితే, దానినే వేద వాక్కుగా పరిగణించి అదే కమ్యూనిస్టు పార్టీ ప్రచురణ యని యనుకొనుట పొరపాటు కావచ్చును కదా యని మదరాసు ప్రభుత్వాన్ని అడుగుచున్నాం. ఒక వేళ సామ్రాజ్య వాదుల ఏజంట్లగు పోలీసులే ఇవి ప్రచురించి మద్రాసు ప్రభుత్వమునకు ఇవి చూపించి యుండరాదా? ఇందాశ్చర్య మేమీ లేదు. మద్రాసు కాంగ్రెసు ప్రభుత్వమునకు సైతము తెలియని కేంద్ర ప్రభుత్వపు గూఢచారు లున్నారని వినుచునే యున్నాము.

కాదు. రహస్యముగ పని చేయు కమ్యూనిస్టు పార్టీయే ఇవి ప్రకటించినదని యనుకొందాము. వారు ప్రకటించిన పూర్తి భాగములు లేవు. వారేనాడు ప్రకటించిరో తెలియదు. వారు ప్రకటించిన భాగములలో సందర్భము విడిచి కొన్ని 'ముక్క'లను ప్రకటించి ఇది కమ్యూనిస్టు పార్టీ యభిప్రాయమని ప్రభుత్వము తెల్పుతోంది. "అయ్యా, ఇది మా అభిప్రాయం కాదు అనియో, అవును మేమలా చెబుతున్నామనో" చెప్పుకొనడానికి కమ్యూనిస్టు పార్టీకి నోరు లేదు. కమ్యూనిస్టు పార్టీ నిషేధింపబడింది. దాని శాఖలు కూడ నిషేధింపబడినాయి. పౌరసత్వ హక్కులకై ప్రతిజ్ఞ కొన్న కాంగ్రెసు ప్రభుత్వాలు సైతము దాని శాఖలపై నిషేధము తొలగించలేదు.

మద్రాసు ప్రభుత్వము "అలాంటి కార్యక్రమం జయం పొందడం సాధ్యం కాదు. ఎవరూ ఏమీ భయపడ నక్కర లేదు." అని హెచ్చరిక గావించింది. అలాంటప్పుడు ఈ ప్రకటన యొక్క అవసరం ఏమిటి? పోనీ కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించి, "జయం పొందజాలనట్టి" వారి కార్యక్రమాన్ని ప్రజల ముందు ఎందుకు పెట్టుకోనీయరాదు? నిషేధము పోయి, ప్రచారం చేస్తున్న కమ్యూనిస్టులను ప్రజలు "ఏమయ్యోయ్! మీ కార్యక్రమం జయం పొందజాలదు. అసంభవం. మేం భయపడటం లేదు మీ కార్యక్రమాన్ని చూచి." అనేటట్లు మద్రాసు ప్రభుత్వం ఏల చేయరాదు? అంతే గాని, పదవి తమ చేతులలో నున్నదని, కమ్యూనిస్టుల నోరు గట్టివైచి, సామ్రాజ్యవాదుల రాజ్యాంగ యంత్రాన్ని ఉపయోగించుకొని, కమ్యూనిస్టులపై దండెత్తుటలో కాంగ్రెసు ప్రభుత్వము అనాలోచిత మగు కార్యమే చేసింది.

ఇక ప్రభుత్వం వెలువరించిన కరపత్రంలో ప్రకటించినట్లు నిజముగా కమ్యూనిస్టులు కానిస్టిట్యూయంటు అసెంబ్లీ (ప్రజా పరిషత్తు) నిరోధించుచున్నారా? నిషేధింపబడిన కమ్యూనిస్టు పార్టీ యభిప్రాయ మిది యని చెప్పట కష్టమే. అయినా బహిరంగంగా అనేక ప్రఖ్యాత కమ్యూనిస్టు లున్నారు. వారి యభిప్రాయము ఈ 'కరపత్రము' లోని విషయముతో ఏకీభవించునా అనునది ప్రశ్న. ఏకీభవించదని ముమ్మాటికిని మా అభిప్రాయం.

మూడవ అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ (దాని ఇండియా శాఖయే నిషేధింపబడింది.) లో చిరకాలం నుంచి యున్న, "పామీదత్తు, బెన్‌బ్రాడ్లే" గారలు హిందూదేశ జాతీయ పోరాటంపై ఒక వ్యాసం వ్రాశారు. అది "కాంగ్రెసు సోషలిస్టు"లో 1936 మార్చి 14 వ తేదీన ప్రచురింపబడింది. వారిని కమ్యూనిస్టుల తరపున ప్రమాణంగా తీసికొనవచ్చును. వారు కాన్‌స్టిట్యూయంటు ఎసెంబ్లీ విషయమై ఇలా చెప్పారు.

"హిందూ దేశంపైన బ్రిటిష్ సామ్రాజ్యం జారీ చేసిన రాజ్యాంగాన్ని రుద్దుతున్న సమయంలో, 100 కి 90 మందికి వోటు లేని ఎన్నికల తమాషాను సాగించుతున్నపుడు, మిగతా 10 మంది యైనా తమ ప్రతినిధులను ఎన్నుకొన్నా, అధికారం లేకుండా చేస్తున్న సమయంలో, బ్రిటిష్ సామ్రాజ్య వైఖరికి వ్యతిరేకంగా, వయస్సు వచ్చిన ప్రతివానికి ఓటు హక్కు ఉండి ఎన్నుకొనబడే కానిస్టిట్యూయెంటు అసెంబ్లీ (ప్రజా పరిషత్తు)ని కావాలని కోరాలి. ప్రచారం చేయాలి. బ్రాడ్‌కాస్టు చేయాలి."

ఇంతే గాదు. హిందూదేశ కమ్యూనిస్టులు చాలమంది సంతకం చేసి హరిపుర కాంగ్రెసుకు పంపిన అభినందన వ్యాసంలో (16—2—38 నవశక్తి) ఇలా ఉన్నది.

"రాజ్యాంగచట్టాన్ని నాశనం గావించుటకు, సర్వస్థాన ప్రజా ప్రతినిధులతో సైతం కూడినకానిస్టిట్యూయెంటు అసెంబ్లీ (ప్రజా పరిషత్తు) కొరకు, రాజకీయ ఖయిదీ లందరి విడుదల కొరకు.........మనం నిలబడి పోరాడాం."

ఇంతే గాదు, వారిదే సందర్భములో ఇచ్చిన నినాదాలు కూడ పరికించండి.

"కాంగ్రెసు మహా సభ వర్ధిల్లు గాక!"

"నూతన రాజ్యాంగాన్ని బహిష్కరించండి."

"ఫెడరేషన్ నశించాలి."

"కాన్‌స్టిట్యూయంటు అసెంబ్లీ కావాలి! రావాలి!!"

వీటన్నిటినీ త్రోసి పుచ్చి, కాన్‌స్టిట్యూయంటు అసెంబ్లీకి వ్యతిరేకమని చెప్పు కొన్న ఆ కమ్యూనిస్టు లెవరో? మద్రాసు ప్రభుత్వం ప్రకటించిన ఆ కరపత్రము లెట్టివో?

ఇక "జాతీయ విప్లవ సమ్మె"ను గురించి మద్రాసు కాంగ్రెసు ప్రభుత్వమంత కంగారు పడ నవసరము లేదు. నేడు "ఫెడరేషన్ వస్తే పన్నుల నిరాకరణం సాగిస్తాం. సైనికులు మావైపుకు వస్తారు." అని జవహరులాలే ఘంటాపదంగా ఛాంబర్లేన్ వాకిటముందు గర్జిస్తున్నాడు.

ఏది యెట్లున్నా, ఈ ప్రకటనచే కాంగ్రెసు వారిలో కమ్యూనిస్టుల యెడ దురభిప్రాయాన్ని కలుగ జేయ ప్రయత్నించారు మద్రాసు ప్రభుత్వంవారు.

ఢిల్లీ ఎసెంబ్లీలో సామ్రాజ్య వాదులు ప్రవేశ పెడుతున్న యుద్ధ ప్రతికూల బిల్లు రాబోవు నిర్బంధ విధానాన్ని కన్నులకు కట్టినట్లు సూచిస్తోంది. ఫెడరేషనుపై సత్యమూర్తి సరససల్లాపాలు సాగుతూనే ఉన్నాయి. సంగ్రామ మేఘాలు నలుదిశలా అలముకొను చున్నాయి. సామ్రాజ్య వ్యతిరేక సంఘటనను చీల్చడానికి సామ్రాజ్య వాదులు సంతతమూ ప్రయత్నిస్తూనే ఉన్నారు. మితవాదుల దరితీసి అతివాదుల అణచుట వారి రాజనీతి. దీనికి కాంగ్రెసు ప్రభుత్వాలు లొంగ కూడదు.

బొంబాయిలో కమ్యూనిస్టు ఖైదీని కొరడాతో కొట్టడమే గాక, దాన్ని విచారణ కమటీ సమర్థించడం, మద్రాసులో, సోషలిస్టుల, కమ్యూనిస్టులపైన సి. ఐ. డి. నిఘా యే గాక మంత్రులు పోలీసులను పొగడటం, ఇప్పుడీ ప్రచురణను ప్రకటించడం, జాతీయైక్య విధానాన్ని చీల్చడానికి కారణాలవుతాయి. అంటే, సామ్రాజ్య వాదుల వలలో చిక్కుకోవడ మన్నమాట. సామ్రాజ్య వాదాన్ని కూలద్రోయుటలో తమకు తోడ్పడుచున్న కమ్యూనిస్టులపై కాంగ్రెసు ప్రభుత్వాలు దండయాత్ర మాని, ఫెడరేషను నిరాకరణ సమస్యపై, సామ్రాజ్య వాద వ్యతిరేక శక్తులన్నీ మిళితం చేసి, బ్రహ్మాండమైన దండయాత్రను, సామ్రాజ్య వాదంపై సాగించడానికి కాంగ్రెసు మంత్రి వర్గాలు తయారుగా నుండవలెనని, మద్రాసు ప్రభుత్వంవారిని హెచ్చరిస్తున్నాం.



# నిర్బంధ విధానం సాగించడానికి మరొక చట్టమా!

## రౌలట్ ఆక్టు రోజులలోవలె

## ఈ బిల్లుకు వ్యతిరేకంగా తీవ్ర ఆందోళన లేవదీయాలి.

శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావు

బ్రిటీషు సామ్రాజ్యం భారత దేశాన్ని స్థిరంగా బానిస తనంలో ఉంచి, తనకు ముడి వస్తువుల సప్లయి చేస్తూ తన పారిశ్రామిక వస్తువుల అమ్ముకోడానికి విక్రయ శాలగానూ ఉంచి, భారత ప్రజా సామాన్యాన్ని దోచుకోడానికి అనేక నిర్బంధ శాసనాలు చేసుకొంది. నోరు మెదల్పకుండా తాళం వేసే 108 సెక్షన్ ఉంది. మెదిలితే కదిలితే యావజ్జీవం జైలు కంప గల్గిన 124 A (రాజద్రోహం) తయారు. ప్రజలు సమావేశం కాకుండా, ప్రజలకు వారి దౌర్భాగ్యానికి కారణాలను ఎరుక పరచకుండా అరికట్ట గలిగిన 144 సెక్షన్ ఉంది. స్వాతంత్ర్యం కొరకు పోరాడే సంస్థలను అక్రమ సంఘాలుగా ప్రకటించి తత్సంఘ సభ్యులనందరిని 'శాంతి భద్రతల' కోసమని జైలుకంప జాలు 17 A. క్రిమినల్ లా అమెండుమెంటు భద్రంగా ఉంది. 1932 శాసనోల్లంఘనోద్యమంలో ఏరి కూర్చిన ఆర్డినెన్సులన్నీటినీ సమకూర్చి చేసికొన్న ఎమర్జెన్సీ పవర్సు ఆక్టు బ్రతికేవుంది. బెంగాల్, పంజాబ్ క్రిమినల్ లా అమెండుమెంట్లు, ఒక చోటికి రావద్దని (ఎక్‌స్టరన్మెంటు) ఒక చోటనుంచి కదలవద్దని (ఇంటరన్మెంటు) నిషేధాలు చేయగల రెగ్యులేషన్లు, విచారణైన లేకుండ జైళ్ళయందుంచ గలవి ఎన్నో ఉన్నాయి.

మరి అవన్నీ చాలకో—యేమో—సామ్రాజ్య వాదులు యింకో శాసనం చేయబోతున్నారు. ఢిల్లీ కేంద్ర శాసన సభలో ప్రభుత్వ సభ్యుడు యుద్ధ ప్రతికూల ప్రచారాన్ని అరికట్టడానికి ఒక బిల్లు ప్రతిపాదింప నున్నాడు. దీని లక్ష్యము కేవలం యుద్ధం వద్దని మాత్రం బోధించే శాంతికాముల నరికట్టుట కాదట. రాబోవు యుద్ధంలో బ్రిటీషువారికి సాయం చేయవద్దనీ, సైనికులుగా చేరవద్దనీ, చేరినవాడు యుద్ధం చేయవద్దనీ ప్రచారం గావించు వారిపై మాత్రం ప్రయోగించడానికట. ఈ బిల్లు ప్రకారం అటుల చేయువారికి రెండు సంవత్సరాల కఠిన శిక్ష, జరిమానా లేక రెండూ విధించ వచ్చును.

అసలే యిదివరకున్న నిర్బంధ శాసనాల వలన మనకున్న పౌరసత్వ హక్కులే అత్యల్పము. కాంగ్రెస్ మంత్రి వర్గాలులేని రాష్ట్రాలలో అసలే లేవు. అట్టిచో యీ బిల్లు శాసనమైతే పౌరుల సామాన్య స్వేచ్ఛకూడ అరికట్ట బడునని వేరే చెప్పనక్కరలేదు.

ఈ బిల్లు 'శాంతి కాములకు' (Pacifists) వర్తించదని చెప్పుటలో అర్థంలేదు. ఎవరైననూ శాంతి కావాలనీ యుద్ధం వద్దని నిజంగా కోరితే గాలి కబుర్లతో కాలం పుచ్చలేరు. ఇప్పటి బాంబులు విషవాయువులతో కూడిన యుద్ధాల భీకర దృశ్యాలను వర్ణించక తప్పదు. తప్పక సైన్యంలో చేరువారిని—ముఖ్యంగా తమ దేశ రక్షణకొరకు గాక సామ్రాజ్య వాదులకొరకు జరుగు యుద్ధాలలో చేరువారిని-నిరుత్సాహ పరుస్తుంది. కాన అదియు సైన్యంలో చేరవద్దని (Anti recruitment) ప్రచారమే అవుతుంది. శాంతి కాములు సైతం తమ ప్రచారం జయప్రద మౌటానికి యుద్ధాలకు కారణాలు చెప్పాలి. కాపిటలిజానికి ఆఖరి దశ (Monopaly stage)యగు సామ్రాజ్యవాదం ఆర్థిక చిక్కులనుండి బయట పడటానికి, దేశంలోని అసంతృప్తిని, వక్రమార్గాల పట్టించడానికి, దేశ భక్తిని రెచ్చగొట్టి, ప్రజా సామాన్యమును యుద్ధాలకు పురిగొల్పు తుంది. అందుచే సామ్రాజ్య యుద్ధాలు, వాటితో పోరాడు సైనికుల లాభం కొరకుగాక కాపిటలిష్టుల దోపిడీ కొనసాగటానికి అవసరమైన మార్కెట్టుల కోసమేనని తెలియ చెప్పాలిసి వస్తుంది. అంటే ఇదియు సైనికులుగా చేరవద్దను ప్రచారం క్రిందకే వచ్చును గదా. తమ మేలుకొరకు యుద్ధం జరుగుట లేదని గ్రహించ గల్గిన సైనికులు యుద్ధంలో పాల్గొనరు కదా!

పై కారణాల వలన ఆచరణలో శాంతి కాముల నడంచుట యీ బిల్లు వుద్దేశ్యము కాదనుటలో అర్థం లేదు. అసలు యుద్ధ వ్యతిరేక ప్రచారానికే ఆటంకం కలిగించుతుంది. యుద్ధానికి తీవ్ర ప్రయత్నాలు గావించుచున్న బ్రిటీషు సామ్రాజ్య వాదులు, ఇతర నిర్బంధ శాసనాలకు దీన్ని తోడుచేసి యుద్ధ సమయంలోనూ, ముందూ మాటాడితే 'మర మేకులు'కొట్టి పౌర స్వాతంత్ర్యం మృగ్యం గావించి నిరంకుశంగా ఏలుతారు.

పాపం! ఈ మధ్య సంపూర్ణ స్వాతంత్ర్యం లక్ష్యంగాగల్గిన కాంగ్రెసులోని మితవాదులలో (Right Wing) కొందరు (సత్యమూర్తి ప్రభృతులు) స్వల్ప మార్పులతో ఫెడరేషను అంగీకరించ వచ్చునంటున్నారు. డాక్టరు పట్టాభిగారు చెత్త అని త్రోసి వేయ తీర్మానించిన 1935 ఇండియా ఆక్టునే పుటం పెట్టి బంగారు తీస్తున్నా మంటారు. కృష్ణా పత్రిక 1935 ఆక్టులో మార్పులు చేసియో చేయకయో తన సూచనలను (ఆర్థిక, సైన్య, విదేశ, ఆంతరంగిక వ్యవహారాల్లో పెత్తనం) అంగీకరించి ఫెడరేషను విషయమై రాజీ పడవచ్చు నంటున్నది. వీరంతా శాసనం కాబోవుచున్న బిల్లునుగాంచి తమ పొరపాటును దిద్దుకొంటారని ఆశించుతాను. హరిపుర కాంగ్రెసు మహా సభ బ్రిటీషు సామ్రాజ్యం పాల్గొనే యుద్ధాలలో భారతీయులు పాల్గొనరనియు, సాయము చేయరనియు తీర్మానించినదిగదా? ఆ ప్రకారము ప్రచారం గావించు ప్రతి కాంగ్రెసు వాది, కాంగ్రెసు కమిటీ, నేరస్థుడే గదా రాబోవు యీ శాసనం క్రింద.

కొందరనుకొనునట్లు బ్రిటీషు సామ్రాజ్య వాదులు నేడు భారతీయులతో సమాన ప్రతిపత్తిపై రాజీకి సిద్ధపడుటలేదు. వారికి యూరప్ క్లిష్ట పరిస్థితులు, ప్రపంచ సంగ్రామములో తమ సామ్రాజ్యాన్ని కాపాడుకొనే చిక్కులు వున్నమాట నిజమే. కాని సామ్రాజ్య వాదులివ్వ దల్చినది, భానిసలకు యజమాని తన కష్ట దినాలలో కాళ్లు పిసికించుకోడానికి యిచ్చు తియ్యని మాటలు, చేతి విదలింపులు మాత్రమే.

ఇదే పరిస్థితులుండిన 1914 ప్రపంచ సంగ్రామపు రోజుల్లో జరిగిన సంగతులు జ్ఞప్తికి తెచ్చుకొందాము. చరిత్రనుండి అనుభవాన్ని సంపాదించుకొందాం. అపుడు బ్రిటీషు ప్రధాని లాయిడ్ జార్జి 'స్వయం నిర్ణయ సూత్రం' (Self determination of small Nations) అమలు జరుపుటకే తాము యుద్ధం చేసున్నామని తియ్యని కబుర్లు చెప్పాడు. వైస్రాయి, గవర్నర్లు దర్బారులు జరిపి రాజకీయ వేత్తలను (కాంగ్రెసు వారినికూడ) పిలచి ధర్మ సంస్థాపనార్థం బ్రిటన్ చేస్తున్న యుద్ధంలో సాయపడాలని కోరారు. గాంధి వగైరాలు దగాపడి సాయం చేశారు. 'మా స్వరాజ్యం మాటేమిటి' అని తిలక్ గారన్నారు. అట్టి వారిని (బీసెంటు, మహమ్మదలీ, షౌకతాలీ వగైరా అనేక మందిని) డిఫెన్సు ఆఫ్ ఇండియా ఆక్టు (యిండియా సంరక్షణ చట్టం) క్రింద జైళ్లకు పంపారు.

అంటే ఏమిటి? సామ్రాజ్య వాదం ఇపుడు కోరునది భారతీయులతో సమాన ప్రతిపత్తిపై రాజీ చేసుకొనుట కాదు. తలవొంచి వారికి అడుగులకు మడుగులు లొత్తిన, ప్రపంచ సంగ్రామ సమయంలో ఒత్తిడి గలుగ జేయకుండా మారణ హోమంలో మనుష్యులను, ధన ధాన్యాలను ఆహూతి యొసంగిన-తియ్యని మాటలతో నోటితో లేదనక చేతితో లేదంటూ రాజీ పడటానికి మాత్రమే తయారవుతారు. వారు మనలను కోరునది బుద్ధి మంతులగు బడి పిల్లలవలె విధేయులై వుండి, సాయపడి వారి దయా ధర్మ భిక్షలకొరకు వేచియుండమని. లేనిచో ఖబడ్దార్ అంటూ యుద్ధ ప్రతికూల శాసనం చేయబోతున్నారు.

ఇట్టి రాజీ సమానుల మధ్య కాదని కాజాలదని సంపూర్ణ స్వాతంత్ర్యం అపేక్షించు ప్రతివారు ఒప్పుకొంటారు. సమాన ప్రతిపత్తిపై రాజీకి నిదర్శనము భారతీయులందరిచే నిరసింప బడిన 1935 ఆక్టును అమలు జరుపుటకాదు. ఈ ఆక్టును రద్దుపరచి దాని స్థానే యుక్త వయస్కులగు భారత ప్రజలందరిచే ఎన్నుకోబడిన కానిస్టిట్యుయెంటు అసెంబ్లీచే నిర్ణయింప బడిన రాజ్యాంగ విధానాన్ని ఎట్టి మార్పును లేక అంగీకరించుటే సమానతకు నిదర్శనమౌను.

కాబట్టి తమ హృదయాంతరాళాల్లో నే మూలనైన స్వరాజ్య మపేక్షించు ప్రతివారూ, పౌరసత్వ హక్కు నపేక్షించు అందరూ, యీ నిరంకుశమైన బిల్లును, శాసనం గాకుండా ఆందోళన చెయ్యాలి. గ్రామ గ్రామాన సభలు జరిపి ప్రజాభిప్రాయాన్ని ఢిల్లీ అసెంబ్లీలోని కాంగ్రెస్ పార్టీకి, వేయేల శాసన సభ్యు లందరికీ తెలియజేయాలి. ముస్లిమ్‌లీగ్ కూడ ఆదర్శము సంపూర్ణ స్వాతంత్ర్యమే నన్నది గాన ఆ సభ్యులపై కూడ నియోజక వర్గాల నుండి ఒత్తిడి తేవాలి. రౌలట్ ఆక్టుకు వ్యతిరేక ఆందోళన వలెనే దేశమంతా ఈ ఆందోళన మారు మ్రోగాలి, సామ్రాజ్యవాదులు

(మిగత 22 వ పేజీలో)

# గ్రంథావలోకనము

## ప్యారిస్ కమ్యూన్

అనువాదకుడు:—మహీధర జగన్మోహనరావు
110 పేజీలు. వెల 6 అణాలు.
అడ్రసు:—
విశ్వ సాహిత్యమాల.
ముంగండ.
(Via.) అంబాజీపేట.
తూర్పు గోదావరి జిల్లా.

★

"కమ్యూన్‌లో పోరాడిన వాళ్ళని ఒక్క ఫ్రెంచి శ్రామికులే గాక ప్రపంచమంతటా వున్న శ్రామికులు గౌరవిస్తున్నారు. ఎందుచేతనంటే కేవలమూ స్థానికమైన హక్కుల కోసంగాని, సంకుచితమైన జాతీయాదర్శాల కోసంగాని కమ్యూన్ పోరాడలేదు. మానవ సమాజంలోని కష్టజీవు లందరికొరకూ, అణచిపెట్టబడి, దోపిడి చేయబడుచున్న పీడిత ప్రజ లందరి యొక్క స్వేచ్ఛకొరకు పోరాడింది. ఎక్కడెక్కడ పీడించబడుతూ, పోరాడుతూన్న శ్రామికులున్నారో అక్కడక్కడ సామాజిక విప్లవం కోసం పోరాడే వాళ్ళలో అగ్రేసరాలుగా కమ్యూన్ కీర్తించబడుతూ, సానుభూతి పొందుతూంది. దాని జీవితం పతనం; ప్రపంచానికే ముఖ్యమైన పారిస్‌నే స్వాధీనం చేసుకొని రెండు నెలలుపైగా తమ స్వాధీనంలో వుంచుకున్న కష్టజీవుల ప్రభుత్వం; శ్రామికవర్గము యొక్క బ్రహ్మాండమైన పోరాటం, ఓటమి, తర్వాత వాళ్ల కష్టాలు:—వీటి నన్నిటిని చూసిన తర్వాత ప్రపంచమంతట కోట్లకొద్దీ కూలీలు మేలుకున్నారు. ఇవన్నీ వాళ్ళల్లో నూతన ఆశలు కల్గించి, వాళ్ళకి సోషలిజంపట్ల గాఢ సానుభూతిని గల్గించాయి. పారిస్‌లో మ్రోగిన ఫిరంగి మ్రోతలు గాఢనిద్రలో, వెనకబడియున్న శ్రామికుల్ని మేల్కొల్పి, ప్రతిచోటా విప్లవయుత సోషలిస్టు ప్రచారోత్సాహాన్ని కలిగించినాయి. ఇందువల్లనే కమ్యూన్ చనిపోలేదని మనం అంటున్నాము. ఇప్పటికి మనలో ప్రతి ఒక్కనిలోనూ, అది జీవించేవుంది" అన్నాడు రష్యా శ్రామిక విప్లవాన్ని జయప్రదంగా నడిపిన లెనిన్. మొట్టమొదటి శ్రామికవర్గ విప్లవ నిర్మాణం అయిన పారిస్ కమ్యూన్ ప్రాముఖ్యతను గురించి యింకా చెప్పవలెనా!

ఇందు సామాజిక మార్పు, విప్లవాల కొరకు పోరాడేవారు, పార్టీలు గమనించవలసిన సూత్రాలను చక్కగా వ్యక్తీకరించాడు లెనిన్. ఉదాహరణగా—

"వెర్సేలిస్ ద్రోహుల గుంపు పారిస్‌పై దాడి సల్పినపుడు పారిస్ శ్రామికులు పోరాడకుండానే తమ ఆయుధాల్ని లొంగదీసివుంటే అట్టి బలహీనతవల్ల శ్రామికవర్గ ఉద్యమంలో కలిగివుండే నైతిక పతనమూ, భీరుత్వమూ మిక్కిలి వినాశన కరములై వుండేవి.... పోరాటంలో వాళ్ళు పొందిన నష్టం ఎంత ఎక్కువైనా పోరాడకుండా లొంగి పోవడంవల్ల ఉద్యమానికి కలిగే నైతిక పతనంకన్న ఎక్కువ నష్టదాయకం కాదు."

"పైనండిన ప్రయోజనాలను సాధించడంలోనూ, విప్లవాలకై తయారవడంలోనూ శాంతియుత పద్ధతుల ప్రాముఖ్యత, అవసరమూ చాలా వుంటుంది. కాని వర్గకలహం ఒకప్రత్యేక దశకు వచ్చేటప్పటికి సాయుధ పోరాటంగానూ, అంతర్యుద్ధంగానూ మారక తప్పదని శ్రామికులు జ్ఞాపకం వుంచుకోవాలి."

1871 ఏప్రియల్ మొదటిసారి శ్రామికవర్గ నియంతృత్వం ఏర్పరచిన పారిస్ కమ్యూన్ రెండు నెలలలోనే పతన మగుటకు కారణాలు యివి. (1) అప్పటికింకా పారిస్ కార్మికులు చిన్న చిన్న పరిశ్రమలలోనే పనిచేయువారై, 18వ శతాబ్దపు జాకోబినుల దేశభక్తి, భ్రమలు గల్గి వుండుట (2) శ్రామికవర్గ ఏకైక కార్మిక వర్గ రాజకీయ పార్టీ నిర్మాణమై వుండకపోవుట, (3) శ్రామికవర్గం, అత్యధిక సంఖ్యాకులుగా ఉన్న కర్షక ప్రజా సామాన్యాన్ని తమ వైపు ఆకర్షించుకో లేకపోవుట.

పారిస్ కమ్యూన్ అనుభవం స్వల్పమే అయినా, ఉన్న రెండు నెలలూ, జర్మనుల చేత చావు దెబ్బలని తోక ముడచిన బోనపార్టిస్టుల దాడి నెదుర్కొనుటకు ఎల్లపుడూ సిద్ధంగా వుండుటచే, కమ్యూన్, ప్రభుత్వ కార్యాలయం కంటే, బారికేడ్ (Paricade) గానే వుండవలసి వచ్చినప్పటికి, ఏ యితర ప్రభుత్వం ఒక తరంలో కూడా చేయజాలని పనిని శ్రామిక వర్గ నియంతృత్వమైన కమ్యూన్ చేయగల్గింది. (1) ఉద్యోగుల యొక్క పెద్ద జీతాల్నీ ప్రత్యేక సౌకర్యాల్నీ తొలగించింది. వాళ్ళ జీతాల్ని సామాన్యపు పనివాని యొక్క కూలీ రేటు కంటే ఎక్కువ వుండకుండా చేసింది. (2) అన్ని పదవులకూ, పరిపాలనా, న్యాయ విద్యా శాఖలన్నిటికీ కూడా ఉద్యోగుల సార్వజనిక ఓట్లచే ఎన్నుకో బడాలని నిర్ణయించింది. (3) పెట్టుబడిదారీ ప్రభుత్వంలో ప్రజల నణచి పెట్టడానికి నిర్మితమైన పోలీసు—సైనిక సంస్థల్ని బ్రద్దలుకొట్టి ప్రజా సామాన్యాన్ని ఆయుధ సహితుల్ని చేసింది. (4) తాకట్టు పెట్టబడిన పేదవాళ్ళ వస్తువులు తిరిగి ఉచితంగా యిచ్చేసింది. (5) విదేశీయులు కూడా అన్ని పదవులకూ ఎన్నుకోబడ వచ్చుననీ, 'ప్రపంచ ప్రజా స్వామ్యధ్వజమే—కమ్యూన్ ధ్వజమని ప్రకటించింది. (6) ఫ్యాక్టరీలన్నీ రిజిస్టరు చేసి అందు పనిచేయు కార్మికుల సహకార సంఘాలకు వానిని అప్పగించింది. (7) విద్యావిధానంలో (చర్చి) మతానికున్న అధికారాన్ని రద్దు చేసింది. (8) ఇంకా ఎన్నో చేయడానికి ప్లానులు వేసింది.

కమ్యూన్ తన గమ్యస్థానాల చేరకముందే వెర్సేలిస్ సేనలు కురిపించే అగ్నివర్షంలో మునిగిపోయి మొట్టమొదటి కూలీ ప్రభుత్వం 25 వేల స్త్రీ పురుషుల, పసిపాపల రక్తంలో కృంగి మేనెల 23 తేదిని కూలిపోయింది.

అనువాదకులు శ్రమపడి భాష సరళంగా నడచునట్లు చేయడానికి ప్రయత్నించారు. కొంత వరకు జయం పొందారని చెప్పవచ్చు. ఏమైనా క్లిష్ట సమస్యలను చర్చించునట్టి పుస్తకాలను, ముఖ్యంగా అనువాదాలను చదువునపుడు పాఠకులు ఓరిమి, శ్రద్ధ వహించ వలయును.

అనువాదంలో Anarchist లకు 'అరాజ్యవాదులనియు, oppurtunist లకు 'ఒడుగుబాటు దారుల' నీ వాడారు. అరాజ్యవాదు లంటే త్వరగా అర్థం స్ఫురించుట లేదు గాన అరాచకవాదులనే వాడుట మెరుగు.

ఒడుగుబాటు దారులకు బదులింకో పదం వాడాల్సింది. ఆమాట మాత్రం బాగులేదు.

వివిధ సమయాల్లో సందర్భాల్లో లెనిన్ పారిస్ కమ్యూన్‌పై ఒసంగిన అమూల్యమైన వ్యాసాల సంపుటిని అనువదించి ఆంధ్రుల కర్పించిన విశ్వ సాహిత్యమాల వారికి అభివందనాలు.

★

తిరువూరు తాలూకాలో

## జమీందారీ దురంతాలు

రచయిత: పొన్నలూరి రాధాకృష్ణమూర్తి
22 పేజీలు. వెల అర్ధణా

★

"....రైతు దశనుండి కౌలుదారుడై కౌలుదారు నుంచి కమతగాడై, కూలివాడై, సాలుకు కొన్ని రోజులు వెట్టివాడై, బానిసై — ఆ తరువాతనో — చూడండి: జమీందారు సృష్టించే కాలచక్రంలో గిర్రున తిరుగుతూ రైతు ఎన్ని గతులలోకి తలక్రిందులై దొర్లుతూ వుంటాడో" ఇది తిరువూరు తాలూకాలో జమీందారీ విధానం క్రింద కుములుచూ కృంగిపోతూన్న రైతుల స్థితి.

1937 లో జరిగిన శాసనసభా ఎన్నికల్లో జరిగిన ప్రచార ఫలితంగా, కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలోని వాగ్దానాల పూతగా కొని, చైతన్యం పొందిన రైతులు కూలీలు, కాంగ్రెసు మంత్రివర్గం పుచ్చుకొన్న తరువాత, ధైర్యం పొందారు. మధ్యయుగాల ఆచారాలకు, నిరంకుశానికి ప్రతి బింబాలైన జమీందారులకు, కూలి నైతం యివ్వకుండా బలవంతంగా చేయుంచుకోబడే "వెట్టి" చేయ నిరాకరించారు. తత్ఫలితంగా తాము అనుభవించుచున్న అగ్రమహక్కు సల్వాలకు భంగం వాటిల్లినదని జమీందారులు అలజడి ప్రారంభించారు. రైతుల స్వాధీనంలో వున్న భూమిని దౌర్జన్యంగా ఆక్రమణ ప్రారంభించారు. బస్తీల నుండి దిగుమతి చేయించిన రౌడీల తందనాలతో పల్లెప్రజలను భయపెట్ట జూచుట, కాంగ్రెసు ప్రచారకులగు ముదిగొండ్ల వెంకటప్పయ్య గారిని జమీందారీ దౌర్జన్యాలను గురించి పత్రికలకు వ్రాసినందులకు కొట్టుట జరిగాయి.

రైతులు యీసంగతులు పోలీసు వారికి రిపోర్టు చేస్తే వినిపించు కోవడం లేదు. పైపెచ్చు జమీందారుల రైతులపై సివిల్‌క్రిమినల్ ఛార్జీలు దాఖలు చేస్తున్నారు. ఈ విషయమై పశ్చిమ కృష్ణా కాంగ్రెసు కమిటీ తగు శ్రద్ధ వహించి పనిచేయుటకు ప్రచారకుల నియమించింది. అధ్యక్షులు పేట బాపయ్య గారు కోర్టు ధిక్కారమని జైలుకు పంప బడ్డారు.

నియమింప బడిన కాంగ్రెసు ప్రచారకులలో నొకరగు రాధాకృష్ణమూర్తిగారు యీపొత్తాన్ని రచించారు. తిరువూరు తాలూకా రైతుల కూలీల కష్టాలు, జమీందారుల నెదిరించుటకు వారిలో ఐక్యత తెలియచేస్తూ, జమీందారీ విధానం అభివృద్ధి కెటుల ఆటంకమో రుజువు పరుస్తుంది.

రచయిత "నిరాభివృద్ధి" అని వాడారు. బాగులేదు. "మదరాసు ప్రభుత్వం మీద భూస్వామిక తిరుగుబాటు" అనుట కన్న మదరాసు కాంగ్రెసు ప్రభుత్వంపై లేక కాంగ్రెసు మంత్రి వర్గంపై భూస్వామిక తిరుగుబాటు అంటే సబబుగా వుంటుంది. భూస్వామి, జమీందారు అను పదాలను ఒకే అర్థంలో వాడారు. చిన్నరైతు నైతం తనకున్న కొలది భూమిపై తాను స్వామినను కొంటాడు. అందుచే జమీందారు అనే పదాన్నే వాడితే సరిగా వుంటుంది.

ఇటువంటి సంపత్రాలు ప్రకటించి కాంగ్రెసు కమిటీ ప్రజా సామాన్య పోరాటాన్ని అందరి దృష్టికి తెచ్చుట ఎంతేని అవసరము.

— మ. చం.

★

## జోసఫ్ స్టాలిన్ — ఉపన్యాసము.

యు. సో. సో. రి

## నూతన రాజ్యాంగ విధానము

అనువాదకుడు:— అన్నాప్రగడ కామేశ్వర రావు. క్రౌనుసైజు 106 పేజీలు. వెల 8 అణాలు
అతివాద గ్రంథమండలి, గుంటూరు.

★

ప్రజాస్వామ్యం పేరిట "బూర్జువా" దేశాలలో ధనికుల ప్రాబల్యమే హెచ్చింది. కృత్రిమ ప్రజా స్వామ్యంతో ఆయాదేశాలు, తమ వలస దేశాలను, కార్మిక కర్షకులను పీల్చి పిప్పి చేస్తూనే యున్నాయి.

రష్యా విప్లవం జరిగిన నాటినుండి సోవియట్ రష్యా క్రమంగా అన్ని విధాలా వృద్ధి చెందుతూ వచ్చింది. గత సంవత్సరం నూతన రాజ్యాంగం రష్యా ప్రజలు నిర్ణయించు కొనుటలో నిజమగు ప్రజా స్వామ్యం నెలకొల్పబడింది. శత్రు భయంచే ఇదివరకు 'కులాక్' మొదగుల వారికి ఈయబడని అధికారాలు కూడ దీనిలో ఇచ్చారు.

ఈ నూతన రాజ్యాంగ విధానం, ఆనాడు స్టాలిన్ యిచ్చిన చరిత్రాత్మక ఉపన్యాసమూ, ప్రతి స్వాతంత్ర్య ప్రియుడూ, తెలిసి కోదగినవే. ఇట్టి గ్రంథాన్ని ఆంధ్రులకు అందిచ్చిన అతివాద గ్రంథమండలి వారిని ప్రశంసింప వలసినదే.

కాని అనువాదకులు అనువాదములో తగిన శ్రద్ధ చూపలేదు. అనువాదం సాఫీగా నడవ లేదు. అదీగాక యు. సో. సో. రి, ఒకచోట సం. సో. సో. రి, అని ఒకచోట వాడుతూ వచ్చారు. అది ఏమిటో తెలియజేయ లేదు. పాఠకునికి ఈ అక్షరాల అర్థం తెలిసికోడానికి శ్రమ కల్గుతుంది. మొదటిసారియైనా దాని అర్థం "సంయుక్త సోషలిస్టు సోవియట్ రిపబ్లిక్" అనియైనా తెలియజేసి ఉండాలిసింది.

'గెటప్'లో కూడ ఇంకా కొంత శ్రద్ధ చూపాలి ప్రకాశకులు.

చిన్న లోపాలను త్రోసిపుచ్చితే ఈ గ్రంథం ఎంతో ఆవశ్యకమైనది. ఆంధ్రులు తగిన ప్రోత్సాహం ఈ గ్రంథమండలి కిచ్చెదరు గాక.

—టి. వి. ఆర్.



# ఫెడరేషన్ వస్తే బ్రిటిష్ పెట్టుబడిదారుల నియంతృత్వం హెచ్చుతుంది!

శ్రీ కంభంపాటి సత్యనారాయణ

## ప్రభుత్వ వ్యయం.

నూతన రాజ్యాంగ చట్టంలో, 33 వ సెక్షన్ ప్రకారం, ఫెడరల్ ప్రభుత్వము చేయవలసిన వ్యయం రెండు భాగాలుగా విభజించబడింది. మొదటి భాగాన్ని ఫెడరల్ శాసన సభ అంగీకరించుటకు గాని, తిరస్కరించుటకు గాని అధికారం లేదు. చర్చ మాత్రం జరుపుటకు అధికారం ఉంది. అట్టి విషయా లేవంటే:

1. గవర్నర్ జనరల్‌కు ప్రతి యేటా ఈయవలసిన 2¾ లక్షల రూపాయల జీతం, అతడు తన అధికారాలు చలాయించుటలో అవసరమని ప్రకటించు యితర ఖర్చులు.

2. ప్రతి యేటా భారత ప్రభుత్వం తీర్చవలసిన అప్పులు, వాటిపై వడ్డీలు వగైరా.

1934 వ సంవత్సరంలో భారత ప్రభుత్వం తీర్చవలసిన అప్పులు మొత్తం రు. 1212 కోట్లు అనియు, దానిలో రు. 512 కోట్లు ఇంగ్లండులో పుచ్చుకొన్నవే ననియు అంచనా వేయబడింది. గత నూరు సంవత్సరాలలో గ్రేట్ బ్రిటన్ తన సామ్రాజ్యాన్ని విస్తరించుకొనుటకును, ఉన్న సామ్రాజ్యాన్ని కాపాడుకొనుటకును అనేక యుద్ధాలు చేయవలసి వచ్చింది. వాటికి అప్పు అవసరమయింది. రు. 1212 కోట్ల ఋణంలో అధిక భాగం యుద్ధాల కొరకు చేసినదే. అయినప్పటికీ, చట్ట ప్రకారం భారతీయ ప్రజలే యీ ఋణా న్నంతటినీ భరించాలి. ఏటేటా దానిపై చెల్లించవలసిన వడ్డీలు సరే సరి; 100 కి 5 చొ॥ న వడ్డీ రేటు అయినా, ప్రతియేటా 60 కోట్ల రూపాయల చొప్పున భారత ప్రభుత్వ ఖజానా నుండి తీసి యివ్వాలి.

3. ఫెడరల్ మంత్రులకు, ఆర్థిక సలహాదారునికి, చీఫ్ కమీషనర్లకు, ఆర్థిక సలహాదారుని ఉద్యోగులకు మొదలైన సిబ్బందికి చట్టప్రకారం ఈయవలసిన జీతములు, భత్యములు వగైరా.

4. ఫెడరల్ కోర్టు జడ్జీల కీయవలసిన జీతములు, భత్యములు, ఫించన్లు వగైరా.

5. సైనిక వ్యయం, మత వ్యవహారములు, విదేశ సంబంధములు, సరిహద్దు ప్రదేశములలో "శాంతి" ని కాపాడుట మొదలైన వాటికి అవసరమగు ఖర్చు.

మన దేశంలో ప్రతి యేటా 50 కోట్ల రూపాయలకు పైగా సైన్యానికే ప్రత్యేకం ఖర్చు పెట్టబడుతోంది. ఇది గాక, సరిహద్దు ప్రాంతముల ప్రజలను లొంగదీయుటకు బాంబులు, మర ఫిరంగులు, ట్యాంకులు మొదలైనవి ప్రయోగించబడు తున్నాయి. వీటికి కూడా ఎంత ఖర్చు అవసరమో అదంతా దేశ మందలి బీద ప్రజలే భరించి తీరాలి. సరిహద్దు ప్రాంతములలో దినమునకు 1 లక్ష రూపాయల చొప్పున ఖర్చు అవుతోందని బ్రిటిషు ప్రభుత్వమే అంగీకరించింది.

6. బ్రిటిషు ప్రభుత్వం సంస్థానాధీశ్వరులతో చేసుకొన్న సంధి షరతుల ప్రకారం ఎప్పు డెంత ఖర్చు అవసరమో అదంతా ఫెడరల్ ప్రభుత్వమే భరించాలి. ఏదైనా సంస్థానంలో ప్రజలు శాసనోల్లంఘనం గాని, పన్నుల నిరాకరణం గాని, యితర విధములుగా తిరుగుబాట్లు గాని చేసినట్లయితే, అట్టి వాటిని అణచుటకు ఎంత ఖర్చు అగునో ఫెడరల్ ప్రభుత్వమే అదంతా భరించాలి.

7. ఒక్కొక్క రాజధానిలో ప్రత్యేకంగా పరిపాలించ వలసిన మన్య ప్రదేశాల [excluded-areas] కొరకు చేయవలసిన ఖర్చు.

8. ఏ కోర్టు గాని, మధ్యవర్తి సంఘం గాని విచారణలు చేసి తీర్పు చెప్పుటకు అయే ఖర్చు. (ఇది స్పష్టంగా లేదు.)

9. ఈ చట్ట ప్రకారం గాని, ఇక ముందు అమలుపరచవలసిన యితర చట్టముల ప్రకారం గాని చేయవలసిన యితర ఖర్చులు.

ఈ 9 అంశములపైనను వోటు చేసి తమ నిర్ణయాన్ని అమలుపరచుటకు ఫెడరల్ శాసన సభ్యుల కధికారం లేదు. ఫెడరల్ ప్రభుత్వం ప్రతి యేటా చేయవలసిన ఖర్చులో యీ అంశములకు 100 కి 90 వంతులు అని భారత వాణిజ్య సంఘం వారు అంచనా వేశారు. పైగా పట్టునని మిగిలిన 10% వ్యయముపై ఫెడరల్ శాసన సభకు అధికారం ఉన్నప్పటికీ, ఆ అధికారం పేరుకు మాత్రమే. ఎందువల్ల నంటే, శాసన సభ యొక్క నిర్ణయాలను గవర్నర్ జనరల్ త్రోసి పుచ్చ వచ్చును. అంతే కాదు. ప్రభుత్వ వ్యయములో ఏ అంశము ఏ తరగతికి చెందునో నిర్ణయించేదికూడా గవర్నరు జనరలే!

కాబట్టి, ఫెడరల్ ప్రభుత్వం యొక్క ఆదాయమును ఖర్చుపెట్టుటలో ఫెడరల్ శాసన సభ్యులకు ఇంచు మించుగా అధికారం లేదనే చెప్పాలి.

## మంత్రులు మట్టి బొమ్మలు.

ఫెడరల్ ప్రభుత్వంయొక్క ఆర్థిక స్థిరత్వమును, పరపతిని కాపాడు బాధ్యత ఇండియా ఆక్టు 12 వ సెక్షన్ ప్రకారం గవర్నర్ జనరల్‌కే ఈయబడింది. ఈ బాధ్యతను నిర్వహించుటలో అతనికి మితిమీరిన సర్వాధికారము లీయబడినవి. అతడు తన మంత్రుల మాటను నిరాకరించి, వారితో నిమిత్తమే లేకుండా, నిరంకుశంగా అధికారం చెలాయించ వచ్చునని పై సెక్షన్‌లో సూచింపబడి యుంది. కార్యనిర్వాహణ శాఖలో ఆర్థిక మంత్రి ఒకడున్నప్పటికీ, 15 వ సెక్షన్ ప్రకారం ఆర్థిక వ్యవహారముల సలహాదారు కూడా గవర్నరువల్ల నియమించబడ వచ్చును. ఆర్థిక వ్యవహారములలో గవర్నరు జనరల్‌యొక్క సలహాదారునకున్ను, ఆర్థిక మంత్రికిని మధ్య అభిప్రాయ భేదములు కలుగుట కవకాశము లేర్పడును. కాబట్టి, మంత్రియొక్క అభిప్రాయాన్ని తిరస్కరించి, గవర్నర్ జనరల్, "ప్రత్యేక బాధ్యతల" నే నెపంతో, తన ఆర్థిక సలహాదారుయొక్క అభిప్రాయము ననుసరించే వెళ్లను. అనగా, మంత్రివర్గము యొక్కగాని, ముఖ్యంగా ఆర్థిక మంత్రియొక్కగాని అభిప్రాయానికి విలువ సున్న అన్నమాట. ఆర్థిక వ్యవహారముల విషయం వచ్చి నప్పుడు మంత్రులు మట్టి బొమ్మలే నని చెప్పవలసి వస్తుంది.

## బ్రిటిషు వ్యాపారానికి రక్షణలు

ఇండియా ఆక్టులోని 111 వ సెక్షన్ మొదలు 116 వ సెక్షన్ వరకు గల నిబంధనలు బ్రిటిషు వ్యాపారస్థులకు ప్రత్యేకమైన రక్షణ లిస్తున్నాయి. మన దేశంలోనే స్థాపించబడి, మన దేశీయ పరిశ్రమలతో పోటీ చేస్తూన్న అనేక బ్రిటిష్ వ్యాపార సంస్థలను నిరోధించుటకై ఎట్టి చట్టములను ఫెడరల్ శాసన సభలు ప్యాసు చేయకూడదని ఆ నిబంధనలయొక్క సారాంశము. భారతీయ పరిశ్రమలకుగాని, వ్యాపార సంస్థలకుగాని ప్రభుత్వం ప్రత్యేక సౌకర్యాలేవైన యిచ్చినట్లయితే, బ్రిటిషు సంస్థలకుకూడా యిచ్చి తీరాలి! ఇండియాలో వ్యాపారం చేస్తూన్న బ్రిటిషు కంపెనీల ప్రధాన కార్యాలయాలు, పరిపాలక వర్గం బ్రిటిషు ఇండియాలో గాక వెలుపలనే ఉన్న యెడల, అట్టి వ్యాపార సంస్థకు బ్రిటిష్ ఇండియా ఆదాయపు పన్ను చట్టం వర్తించదు. కాబట్టి హక్కులు, ప్రత్యేక సౌకర్యాల విషయంలో ఆంగ్లేయులు భారతీయులతో సమానమేగాక ఎక్కువ లాభాలను పొందుచూ, నిర్వర్తించవలసిన బాధ్యతలు, చెల్లించవలసిన పన్నులు తక్కువ గలిగి యున్నారు. ఈ విషయం 112 వ సెక్షన్‌లో చెప్పబడియుంది.

ఇట్టి మాదిరిగానే, ఇంగ్లాండులో వ్యాపారం చేయు ఇండియా దేశపు వ్యాపార సంస్థలకు కూడా సమాన హక్కులు, సమాన సౌకర్యాలు ఈయబడతాయని 112 సెక్షన్ మొదలు 117 వ సెక్షన్ వరకు గల నిబంధనలలో సూచించబడింది. ఒక కథ ఉంది. పెద్ద చేప ఒకటి చిన్న చేప వద్దకు వచ్చి, "నీకూ, నాకూ సమాన హక్కులే ఉన్నాయి. కాబట్టి, నీవు నన్నైనా మ్రింగు, లేక నేను నిన్నైనా మ్రింగుతాను" అని చెప్పిందట. ఆ విధంగా ఉన్నది. భారతీయ వ్యాపార సంస్థల కీయబడు సమాన ప్రతిపత్తి! ఇండియాలో బ్రిటిషువారి పెట్టుబడి యొక్క మొత్తం నేడు 1300 కోట్ల రూపాయల వరకు ఉంది. ఇది గాక, ఇండియాలో వ్యాపారం చేసే బ్రిటిషు వ్యాపార సంస్థలు 1008 కోట్ల రూపాయల పెట్టుబడితో వ్యాపారం చేస్తున్నాయి. పరిశ్రమలలోను, వ్యాపారంలోను పెట్టిన పెట్టుబడిపై ప్రతి యేటా 160 కోట్ల రూపాయల లాభములు ఇంగ్లండు దేశం చేరుతున్నాయి. కాని, ఇంగ్లాండులో వ్యాపారం చేయు భారతీయుల వ్యాపారం అత్యల్పమైనది. కాని, దీనికంటె ప్రధాన విషయం ఏమంటే, ఏ యే దేశస్థుల కెట్టి హక్కులు, సౌకర్యాలు ఉండాలో నిర్ణయించవలసింది ఇంగ్లండులో దేశీయులచే పరిపా

( మిగత ప్రక్క పేజీలో )

# ఫెడరేషన్ వస్తే

( 7 వ పేజీ తరువాయి )

లించబడు బ్రిటిషుప్రభుత్వం అయిఉండగా ఇండియాలో అట్లు కాదు. విదేశ పరిపాలకులే యీ విషయమై చట్టం ప్యాసు చేసి, తమ కెట్టి అధికారాలు ఉండవలెనో తీర్పు చెప్పివేశారు.

మరొక విషయం. ఇండియాలో కొత్త పరిశ్రమ ఏదైనా స్థాపించబడు నప్పుడుగాని, లేక ఉన్నపరిశ్రమకు తగిన ప్రోత్సాహం లేకనో విదేశీ కంపెనీల పోటీ వల్లనో దుస్థితిలో ఉన్నప్పుడుగాని, అట్టి స్వదేశీ పరిశ్రమలకుగాని వ్యాపార సంస్థలకుగాని ప్రభుత్వం, 116 వ సెక్షన్ ప్రకారం ఉచితంగా ప్రత్యేక ద్రవ్య సహాయం చేయకూడదు. చేయాలని ఉంటే బ్రిటిషు సంస్థలకుకూడా చేసి తీరాలి! మరొక సెక్షన్ ప్రకారం బ్రిటిషు గుడ్డపై దిగుమతి సుంకం వేస్తే, ఆ మొత్తానికీ సరిపోయే ఎక్సైజు డ్యూటీ దేశీయ బట్టల పరిశ్రమపై కూడా విధించి తీరాలి.

కాబట్టి, ఇండియా ఆక్టులోని 111 వ సెక్షను మొదలు 116 వ సెక్షను వరకు గల నిబంధనలు దేశీయ పరిశ్రమల యొక్కయు దేశీయ వ్యాపార సంస్థల యొక్కయు ముక్కు, నోళ్లను బిగించి వేసినట్టు చేస్తున్నాయి.

## రైల్వే, రిజర్వు బ్యాంకు.

బ్రిటిషువారి పెట్టుబడిలో అధిక భాగం రైల్వేలలోను, బ్యాంకులలోను ఉన్నది. దేశమందలి రైల్వే కంపెనీలన్నిటి పైనను అధికారం కలిగియుండు సంస్థ రైల్వే పరిపాలక మండలి. ఈ సంస్థలో 7 గురు సభ్యులుంటారు. వీరిలో ముగ్గురిని గవర్నరు జనరల్ నియమిస్తాడు. కాని, ఇండియా ఆక్టుయొక్క 183 వ సెక్షన్ చదివితే, పెత్తనమంతా గవర్నర్ జనరల్‌దేనని స్పష్ట పడగలదు. రైల్వేల ఆదాయ వ్యయములను గురించిగాని, రైల్వే కార్మికుల సౌకర్యములను గురించిగాని ఫెడరల్ శాసన సభ కెట్టి అధికారములు లేవు. రైల్వేలవల్ల రావలసినంత లాభములు వస్తున్నాయా లేదా అనే ప్రశ్నకు మాత్రమే రైల్వే పరిపాలక మండలియొక్క బాధ్యత.

రిజర్వు బ్యాంకి విషయంలో కూడా ఫెడరల్ శాసన సభకు ఎట్టి అధికారము ఈయ బడలేదు. ఆక్టుయొక్క 152 వ సెక్షన్ ప్రకారం, గవర్నరు జనరల్ తన యిష్ట ప్రకారం రిజర్వు బ్యాంకియొక్క గవర్నర్లను, డిప్యూటీ గవర్నర్లను నియమించుటగాని, తొలగించుటగాని చేయవచ్చును. సెంట్రల్ బోర్డును రద్దు చేయుటకుగాని, అసలు బ్యాంకినే ఎత్తివేయుటకుగాని అతడు అధికారం గలిగియుండును. 153 వ సెక్షన్ ప్రకారం, నాణెముల ముద్రణను గురించిగాని, మారకమును గురించిగాని, రిజర్వు బ్యాంకి యొక్క పరిపాలనా పద్ధతులను గురించిగాని ఫెడరల్ శాసన సభ ఎట్టి శాసనం చేయదలచినను, ముందుగా గవర్నర్ జనరల్‌యొక్క అనుమతిని పొందాలి. పొందిన తరువాత ఫెడరల్ శాసన సభ చేత ప్యాసు చేయబడ్డ శాసనమును గవర్నర్ జనరల్ త్రోసివేయ వచ్చును.

రూపాయియొక్క మారకపు రేటును 16 పెన్నీల నుండి 18 పెన్నీలకు ఇండియా ప్రభుత్వం నిరంకుశంగా హెచ్చు చేయుటవల్ల భారత దేశంలో అమ్ముడుపోవు బ్రిటిషు సరుకులపై 100కి 12½ చొప్పున అదనంగా లాభములు వస్తున్నాయి. దేశీయ పరిశ్రమల అమ్మకాలకు 100 కి 12½ చొప్పున నష్టం కలుగుతోంది. ఇందు మూలంగా పత్తి, గోధుమలు మొదలైన ముడి సరుకులను పండించు వ్యవసాయదార్లకు తమ సరుకుపై రావలసినంత ఖరీదు వచ్చుటలేదు. ఈ విధంగా, దేశమందలి అన్ని తరగతుల ప్రజలకును హానికరమైన 18 పెన్నీల రేటు తగ్గించవలసిందని దేశంలో జాతీయ నాయకులు ఆందోళన చేస్తున్నారు. ఒక వేళ ఫెడరల్ శాసన సభలో యిట్టి తీర్మానం ప్యాసయితే, దానిని నిరాకరించుటకు గవర్నర్ జనరల్ అధికారం కలిగి యుంటాడు.

## వర్తకపు ఒడంబడికలు.

ఇండియా గవర్నమెంటుకు యితర దేశాలతో సంబంధించిన వర్తకపు ఒడంబడికలన్నియు గవర్నర్ జనరల్‌యొక్క ఇష్ట ప్రకారమే జరగాలని 11 వ సెక్షన్‌లో ఉన్నది. అట్టి ఒడంబడికలను ఫెడరల్ మంత్రులుగాని ఫెడరల్ శాసన సభగాని అంగీకరించ నవసరంలేదు.

## అనవసపు ఖర్చు.

ఈ "నూతన" రాజ్యాంగ చట్టాన్ని అమలుపరచుటకు, అనగా కొత్త ఉద్యోగస్థులను నియమించుటకు, సలహాదార్లకు, మంత్రులకు, మంత్రుల కార్యదర్శులకు, ఆఫీసులకు, మొదలైన వాటికి అయే ఖర్చు,మొత్తం 10 కోట్లు మొదలు 20 కోట్ల రూపాయల వరకు అంచనా వేయబడింది. ఈ ఖర్చుపై శాసన సభల కెట్టి అధికారము లేదు.

## సారాంశము.

కాబట్టి, భారతదేశం యొక్క ఆర్థిక వ్యవహారము లన్నిటిపైనను బ్రిటిషు పెట్టుబడిదార్లు, బ్రిటిషు వ్యాపారస్థులు సంపూర్ణమైన అధికారం కలిగి యుండే లాగున ఫెడరల్ రాజ్యాంగ విధానంలో కట్టుదిట్టములు చేయబడ్డాయి. ప్రభుత్వమునకు రావలసిన ఆదాయం ప్రజ లీయగలరా,లేరా అనే ప్రశ్నపై ఆధారపడదు. బ్రిటిషు వ్యాపారస్థుల లాభములకు సరిపోయే ఆదాయం వస్తున్నదా లేదా అనేది పరిపాలకుల ప్రశ్న. సరిపోనప్పుడు పన్నులు ఎక్కువ చేస్తారు. ఇండియా ప్రజల జీవితములకు వారిచ్చు విలువ కంటె బ్రిటిషు పెట్టుబడిదార్ల లాభముల కిచ్చు విలువ అనేక రెట్లు హెచ్చు.

# ప్రపంచానికి కాంతిని ప్రసరిస్తూన్న సోవియట్ స్వాతంత్ర్య జ్యోతి.

రొమెయిన్ రోలెండ్.

[ 1917 లో జరిగిన నవంబర్ విప్లవం యొక్క 20 వ వార్షికోత్సవం 7—11—37 న జరిగింది. దాని సందర్భంలో ప్రపంచ విఖ్యాతి గాంచిన ఫ్రెంచి తత్వశాస్త్రజ్ఞుడు,గ్రంథకర్త,అగు రొమెయిన్ రోలెండు ఫ్రెంచి ప్రజల తరపున ఒక సందేశం పంపినాడు. అందలి ఒక భాగం యీ క్రింద ఇస్తున్నాం. రొమెయిన్ రోలెండు రవీంద్రనాథ టాగూరు, మహాత్మా గాంధి, రామకృష్ణ పరమ హంస మొదలైన విఖ్యాత భారతీయులను గురించి అనేక గ్రంథములు వ్రాశాడు. ఇతడు ఫాసిజానికి వ్యతిరేకంగా తీవ్రంగా ప్రచారం చేస్తున్నాడు.]

పాశ్చాత్య ప్రపంచంలో అనేకసంవత్సరముల క్రితం విప్లవం ఒకటి వచ్చింది. అందులో పుట్టి పెరిగిన ప్రజల తరపున కొత్తగా లేచిన మీ అక్టోబరు విప్లవం యొక్క 20 వ వార్షికోత్సవమునకు నేను కృతజ్ఞతా పూర్వకమైన అభివందనము లిచ్చుచున్నాను.

సోవియట్ ప్రెసిడెంటు కాలినిన్

ఫ్రెంచి దేశస్థుల మైన మేము మీ సోదరుల వంటి వారం. మీవలె మేము కూడా ఒకనాడు స్వదేశ విదేశాలలో గల శత్రువులను ఎదుర్కొంటూ అనేక భీకర పోరాటముల సలుపవలసి వచ్చింది. ఆ పోరాటాలలో మా పూర్వులు ప్రదర్శించిన ధైర్య సాహసములకు మేర లేదు. అయినప్పటికీ, ద్రోహులు కొందరు బయలుదేరి మా విప్లవాన్ని నాశనం చేశారు. మా చేతుల నుంచి జారి క్రింద పడిపోయిన జ్యోతిని మీ లెనిన్ మహాశయుడు తిరిగి వెలిగించాడు. అది నేడు ప్రపంచ మంతటి పైననూ కాంతిని ప్రసరిస్తోంది.

ఫ్రెంచి విప్లవం పూర్తి చేయజాలని పని యిప్పుడు మీ దేశంలో చక్కగా కొనసాగుతోంది. మేము కలలుగన్న కొత్త ప్రపంచాన్ని మీరు ప్రత్యక్షంగా నిర్మిస్తున్నారు. మీ ప్రధాన నిర్మాత అయిన స్టాలిన్‌కూ, మీ అందరికినీ, సమస్త జాతులు సమస్త దేశములు సంపూర్ణ స్వాతంత్ర్యంతోను, సమాన ప్రతిపత్తితోను ఐక్యతను పొందుటలో కృషి చేస్తున్న లక్షలాది మీ దేశస్థు లందరికినీ, ప్రతి వ్యక్తీ సంఘ క్షేమంకొరకు పనిచేస్తున్నాననే గర్వంతో, ఆనందంతో, ఉప్పొంగి పోయే దేశ ప్రజ లందరికీ—నేను హృదయపూర్వకమైన అభివందనము లిస్తున్నాను. నేడు ప్రపంచ మంతటను రక్తపుటేరులు ప్రవహిస్తున్నాయి. ఫేసిజం అనే పెనుభూతంతో ప్రపంచ మంతటా ప్రజలు జీవన్మరణ పోరాటాన్ని సాగిస్తున్నారు. వారి పోరాటానికి నాయకత్వం వహించేది మీ దీర్ఘ కృషి. సోవియట్ యూనియన్ యెడల మీకు గల అపార విశ్వాసము అని చెప్పాలి.

యిరోపా, ఆసియా ఖండాలలో మిన్ను ముట్టుతూన్న మీ కంచుకోట (సోవియట్ రాజ్యాంగ విధానం) ఫాసిస్టు వ్యతిరేకులకు చక్కటి రక్షణ యిస్తోంది.

స్టాలిన్

అంతర్జాతీయ వస్తు ప్రదర్శనం సీన్ నదీ తీరాన్ని జరిగింది. హిట్లర్ యొక్క నిరంకుశ విధానమునకు చిహ్నంగా రాబందు పక్షి ఆ ప్రదర్శనంలో చూపబడింది. దానిప్రక్కనే సోవియట్ యూనియన్ యొక్క సమిష్టి వ్యవసాయంలో పని చేసే ఒక యువతి, ఆమె ప్రక్కనే ఒక ఫ్యాక్టరీ కార్మికయువకుడు కొడవలి, సుత్తి చేతులలో ధరించి పొంగి వచ్చే ఆనందం ముఖాలతో నాట్యం చేస్తూన్న రెండు బ్రహ్మాండమైనవిగ్రహాలు నిర్మించబడ్డాయి. ఆ విగ్రహాల హృదయాలలో నుంచి ప్రజలకు స్వాతంత్ర్య సందేశం యిస్తూ ఐక్యతను బోధిస్తూ అంతర్జాతీయ గేయం వినిపించింది. ఫ్రెంచి జాతీయ గీత మగు "మార్సేల్సు" వలె యీ గీతం ప్రజలకు అంతిమ విజయానికి తోవ చూపగలదు."



# ప్రధాని పంతుపై రివాల్వర్ ప్రయోగం

## కాంగ్రెస్ మంత్రులపై జమీందార్ల దురాగ్రహం.

## భారత దేశమంతటా రైతుల పోరాటం వృద్ధి అవుతున్నది.

### ఈస్టు బ్యాంకు కెనాల్ రైతుల సభ.

ఈనెల 12 వ తేదీని కృష్ణాజిల్లా రైతు సంఘాధ్యక్షులగు కామినేని వెంకటప్పయ్యగారి అధ్యక్షత క్రింద చాగంటిపాడులో ఈస్టుబ్యాంకు కెనాల్ రైతులసభ జరిగింది. సభకు వేములకూర్మయ్య (ఎం. ఎల్. ఏ.), కాకాని వెంకటరత్నం, సుంకర సూర్యనారాయణ, నండూరి ప్రసాదరావు, ఏ. వి. రాఘవయ్యగారలు హాజరైరి. గత 20 యేండ్లనుంచి కరువుకాల్వ క్రిందను 3 ఏండ్లనుంచి ఈస్టు బ్యాంకు కెనాల్ క్రిందను సాగు చేసుకొంటున్న పసుపు వగైరా తోటపైర్లకు ఈ సంవత్సరం నీటిని సప్లయి చేయుటకు ఎస్. యి. గారు నిరాకరించి తూములు మూసి వేయించారనియు, ఇప్పటి చీఫ్ ఇంజనీరుగారు యస్. యి. గాఉన్న రోజులలో కాలువను పరీక్షించి పర్మనెంటు తూముల నేర్పరచుటకు వాగ్దానం చేశారనియు, కాబట్టి ఆప్రకారం రైతులు ఆందోళనద్వారా తూములు తెప్పించుకో వలసినదని సభలో అనేకులు ఉపన్యసించారు. లంచగొండితనాన్ని గూర్చి విచారించుటకై పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసుకమిటీ ఏర్పాటుచేసిన సబ్‌కమిటీ ముందు సాక్ష్యమీయవలసిందని శ్రీ వేముల కూర్మయ్యగారు హెచ్చరించారు. ఈస్టు బ్యాంకు కెనాల్‌క్రింద సాగు చేయబడే గ్రామాలకు నీటిని సప్లయి చేయవలసినదిగాను, నీటికి మామూళ్ళు తీసుకొంటున్న దేవరపల్లి, చాగంటిపాడు గ్రామకరణాలపై చర్య తీసుకోవలసినదిగా ప్రభుత్వమునుకోరుచూ తీర్మానించబడెను.

### లింగగిరి ఎస్టేటు.

గత వారంలో శ్రీ పేట బాపయ్య, కాకాని వెంకట రత్నం, అన్నే అంజయ్య, నండూరి ప్రసాదరావు గారలు కృష్ణా జిల్లా యందలి లింగగిరి ఎస్టేటు గ్రామాలలో సంచారం చేసి అక్కడి రైతుల స్థితి గతులను గురించి విచారణ చేసిరి. ఎస్టేటు చిన్నదైనప్పటికీ, అక్రమాలలో పెద్దవాటికి తీసిపోదు. కొన్ని గ్రామాలలో యిజారా పద్ధతివల్ల రైతులు మాడిపోతున్నారు. మంచి భూములకు శిస్తు పాట పెట్టి, యిజారాదారు తరచు కౌళ్ళను మార్చుట వల్ల భూమిని బలం చేసుకొన్న రైతుకు ఆ భూమి దక్కుట లేదు. ఎస్టేటుకు మేత పుల్లరుల నుంచి ఆదాయం వస్తోంది. రైతులు పుల్లరి చెల్లించుకున్నా పరాయి గ్రామస్థుల పశువులు మేసి పోతే గాని వీరివి మేయడానికి వీల్లేదు. పట్టా—ముచ్చిలకాలు గాని, ఎస్టేటు ఉద్యోగస్థు లిచ్చుట లేదు. చాలా పోరంబోకుల్లు జమీందారు గారిచే ఆక్రమింపబడ్డాయి.

### తూముల తగ్గింపు.

కృష్ణా జిల్లా పెనుగంచిప్రోలు ఛానల్‌కు దాదాపు 25 ఏండ్ల నుంచి 6"ల తూములుండగా నీటి సాయదల అవుతోంది. కాని, ఈ యేడాది వాటిని 4"లకు తగ్గించివేయడం వల్ల, ఇసుకపాలు ఉన్న ఆ భూములకు నీరు చాలినంతగా సప్లయి అగుట లేదు. సాగులు నిల్చిపోతున్నాయి. ఇందు విషయమై జిల్లా కాంగ్రెసు కమిటీ నాయకులు ప్రభుత్వోద్యోగులతో సంప్రదిస్తున్నారు. కాంగ్రెసు కమిటీ వారిచే నియమించబడిన లంచగొండితన నిర్మూలనపు ఉపసంఘము వారు ఇందు విషయమై విచారణ చేస్తున్నారు.

### దివి తాలూకా రైతు సంఘం.

పై సంఘం ది 10—8—38 వ తేదీని చల్లపల్లిలో కాకర్ల చంద్రశేఖరరావు గారి అధ్యక్షత క్రింద సమావేశమై, కీ. శే. గుత్తికొండ సత్యనారాయణ గారి స్థానే గుత్తికొండ కోదండ రామయ్య గారిని తాలూకా రైతు సంఘ కార్యదర్శిగా ఎన్నుకొనిరి. దివి తాలూకా రైతు సంఘము వారు నజరానాను ప్రభుత్వమునకు చెల్లించుటను గురించి ఎన్నిసార్లు తెలియజేసినను పెడచెవిని బెట్టినందున, తాలూకా రైతులెవ్వరును నజరానాను చెల్లింపవద్దని హెచ్చరిస్తూ తీర్మానించబడింది. ఈ తీర్మానాన్ని అమలులో పెట్టుటకు యీ క్రిందివారు ఉపసంఘముగా నియమించబడ్డారు: చలసాని వాసుదేవరావు గారు; గొర్రెపాటి వెంకటసుబ్బయ్య గారు; కాచూరు కోదండ-రామయ్య గారు; కాకర్ల చంద్రశేఖరరావు-గారు; గుత్తికొండ కోదండ రామయ్య గారు.

### ఆంధ్రరాష్ట్ర రైతు మహాసభ.

గత నెలలో వాయిదా వేయబడిన పై మహాసభను సెప్టెంబరు 3, 4, 5 తేదీలలో, ప్రతినిధులకు అనుకూలమైన సమయం కాబట్టి; కృష్ణాజిల్లా వీరవల్లి గ్రామములో జరుపుటకు నిశ్చయించబడినదనీ; 3 వ తేదీ ఉదయం కార్యనిర్వాహక వర్గ సభయు, మధ్యాహ్నం స్థాయి సంఘ సభయు, 4 వ తేదీని ప్రతినిధుల సమావేశమును, 5 వ తేదీ ఉదయం తిరిగి ప్రతినిధుల సమావేశమును మధ్యాహ్నం ప్రజల బహిరంగ సమావేశమును జరుగుననీ రాష్ట్ర రైతుసంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ చలసాని వాసుదేవరావుగారు ప్రకటిస్తున్నారు.

### మొఖాసాదార్ల అక్రమాలు.

ప॥ గో॥ జిల్లా గుంటుపల్లి ముఠా రైతుల హక్కు భుక్తములలో ఉన్న 140 యకరాల భూమిని, సాగుచేయకుండా మొఖాసాదారు ఇంజంక్షను చేయించుటచే రైతులకూ మొఖాసాదారుకూ తగాదా ఏర్పడింది. ఉభయ పక్షులకు రాజీ కుదుర్చుటకై జిల్లా రైతు సంఘ నాయకులు ప్రయత్నించారు. భూమిలో సగవంతు అయినా యిస్తే రాజీకి వప్పుకొందుమని రైతు లన్నారు. కాని మొఖాసాదారు తన యిష్టం వచ్చిన 20 యకరాలభూమిని మాత్రం యిస్తాననుటచే రాజీ కుదరలేదు.

ఉప్పుగూడెంలో రైతుల స్వాధీనంలో ఉన్న 100 యకరాలను స్వాధీనం చేసుకోవాలని అగ్రహారందారు నోటీసులు యిచ్చుటేగాక, దౌర్జన్యాలను చేయుటకు రౌడీలను కూడా నియమించినట్లు తెలుస్తోంది. జిల్లా రైతు సంఘం యీ విషయమై విచారణ చేస్తోంది.

బోగోలు మొఖాసాదారు కూడా ముడిచర్ల లోను, బోగోలులోను రైతుల భుక్తంలో ఉన్న భూములను స్వాధీనం చేసుకోవడానికి ప్రయత్నాలు చేస్తున్నాడు. ముడిచర్లలో రైతులు సాగుచేసే భూములను 3 సంవత్సరముల నుండి ఒక పెద్ద రైతు సాగుచేస్తూన్నట్లు ఏక్‌సాలు ముచ్చిలకాలు, అండారపు రశీదులు సృష్టించినట్లు తెలుస్తోంది. అడవులలో చిరకాలంనుంచి రైతులు కంప, కట్టె, ఆకు మొదలైన వాటిని తెచ్చుకోకుండా మొఖాసాదారు నిరోధిస్తున్నాడు. బోగోలులో 22 రు రైతులపై 144వ సెక్షన్ ప్రయోగించబడినది.

### కర్నూలు జిల్లాలో ఫారెస్టు కష్టాలు.

కర్నూలు జిల్లా రైతు సంఘంవారు జిల్లా ఫారెస్టు ఆఫీసర్‌కు సమర్పించిన మెమోరాండంలో కోరిన కోరికలలో యీ క్రిందివి ప్రధానమైనవి.

పచ్చి ఆకు యెరువును ఉచితంగా తెచ్చుకోనిచ్చుట; ఎండు కట్టెలను రిజర్వు అడవుల నుండి ఉచితంగా తెచ్చుకోనిచ్చుట; ఫారెస్టు జిల్లాల సరిహద్దులలో, ఒక రేంజిలో గాని జిల్లాలో గాని పెర్మిటు పొందిన పశువులను రెండు రేంజ్‌లలో, రెండు జిల్లాలలో మేపుకొననిచ్చుట; రిజర్వు అడవులలో సాగుకు అనుకూలమైన భూములను బీద రైతులకు యిప్పించుట; పెంట ఫీజు రద్దుచేయుట; కంచకుగాను కంప ఉచితంగా తెచ్చుకోనిచ్చుట; ఇండ్ల కప్పులకు అవసరమైన సామానులను అడవుల నుంచి ఉచితంగా తెచ్చుకోనిచ్చుట; రిజర్వు అడవులలో నుండు చిల్లర ఫలసాయములను ఉచితంగా తెచ్చుకోనిచ్చుట; లంచగొండి తనమును నిర్మూలించుట.

### సాక్ష్యమిచ్చిన రైతు గతి

విశాఖపట్నం జిల్లా కొత్తగూడెం మొఖాసాదార్లు గంటా అప్పన్నదొరగారు వగైరాలపై సుమారు 8000 రూపాయల బాకీకి సూరి శీతారామయ్యగారు విశాఖపట్నం కోర్టులో దావా తేగా, అందులో మేకా బాలయ్య అనే రైతు సాక్ష్యమిచ్చినాడు. ఆసాక్ష్యం సదరు మొఖాసాదార్లకు ప్రతికూలముగా ఉన్నదను ఈర్ష్య వహించి ఆ బీద రైతును అనేక విధముల హింసిస్తున్నారు. అతని పొలములోని పంటలు యితరులచేత కోయించి అపహరింపచేయుట; నౌకరులచే దుర్భాషల నాడించుట; ప్రాణభయము వాటిల్లగలదని బెదరించుట మొదలైన పనులు చేయించుటవల్ల బాలయ్య జిల్లా కలెక్టరుకు, పోలీసు శాఖవారికి తెలియజేశాడు. కాని యింతవరకు వారు దర్యాప్తు చేయలేదు. ఏ సమయమున ప్రాణాపాయం వాటిల్లునో అనే భయంతో ఆరైతు స్వగ్రామం విడిచి గోలుకొండ తాలూకా పాత కృష్ణాదేవిపేట వెళ్ళిపోయినాడు.

### కలక్టరు బంగాళా దగ్గర సత్యాగ్రహం

గత బుధవారం (10-8-38) నుండి రుస్. నాగప్ప, ఎం. ఎల్. ఏ. గారి నాయకత్వమున ఆర్. అప్పారెడ్డిగారు, వి. కృష్ణమాచార్యులు గారు మొదలైనవారు కోడుమూరు (కర్నూలు జిల్లా) క్షామ నివారణపనులలో సుమారు 2000 మంది పని చేస్తున్నప్పటికీ, ఆపనిని అపు చేయుచూ ఈయబడిన ఉత్తర్వును నిరసిస్తూ కలెక్టరుగారి బంగాళావద్ద సత్యాగ్రహం చేస్తున్నారు.

### రివాల్వరు ఉపయోగం.

లక్నోలో యీ మధ్య జరిగిన జమీందార్ల సభలో ఒక జమీందారు ఉపన్యసిస్తూ, రైతాంగ చట్టమును కాంగ్రెసు మంత్రులు ప్యాసుచేస్తే, తనవద్ద నున్న రివాల్వరును ప్రధాన మంత్రి గుండెవైపు బారు చేస్తానని పలికినట్లు సంయుక్త రాష్ట్రశాసనసభలో ప్రధానిచేతనే తెలియజేయ బడింది.

### సరిహద్దు రాష్ట్రంలో సత్యాగ్రహం

నౌషేరాలో షా అలమ్ అనే పేరుగల వంతెన ఒకటి ఉన్నది. ఆ వంతెనపై రైతుల మీద ప్రభుత్వం వారొక కొత్త పన్ను విధించారు. రైతులు చెల్లించుటకు నిరాకరించి సత్యాగ్రహం చేస్తున్నారు. ఇంతవరకు 46 గురు రైతులను పోలీసులు అరెస్టు చేశారు. సోషలిస్టు రైతు నాయకులు సత్యాగ్రహాన్ని నడుపుతున్నారు.

## జపాను కొంటె యెత్తులు.

రష్యా జపాను యుద్ధం ఆగిపోయింది. సరిహద్దు సంఘర్షణలు 10 రోజులు తీవ్రంగా కొనసాగాక ఇపుడు చల్లబ



లిట్వినాఫ్
కమిషన్‌లో మరొకరిని వేయాలి....

డ్డాయి. రష్యా విదేశాంగ మంత్రి లిట్వినాఫ్, జపాన్ విదేశాంగ మంత్రి షీగ్‌మిట్సు ఒక ఒడంబడికకు వచ్చారు.

ఆ ఒడంబడిక ప్రకారం, 11 వ తేదీన యుద్ధం ఇరుపక్షాలు మానాలి. 10 వ తేదీ అర్ధ రాత్రి వరకు ఎవరు ఏ హద్దులలో ఉన్నారో అక్కడే ఉండాలి. ఇక ఈ సరిహద్దును గురించి విచారించడానికి ఒక కమీషన్ ఉంటుంది. దానిలో ఇద్దరు రష్యన్ ప్రతినిధులు ఇద్దరు జపాన్-మంచూకోల ప్రతినిధులూ ఉంటారు. ఈ విచారణ కమిటీ 1860 రష్యా—చైనా సంధి పత్రము ననుసరించి యున్న మ్యాపును కూడ పరిశీలించుంది. ఈ నల్గురు సభ్యులే గాక మరొకరిని నియమించాలని లిట్వినాఫ్ కోరాడు. కాని జపాను విదేశాంగ మంత్రి తిరస్కరించాడు.

ఈ సంధికి మొదట రష్యా కోరిన కోర్కెలకు జపాను అంగీకరించ లేదు. మొదట 1860 నాటి మ్యాప్ సంగతే తనకు తెలియదని అన్నది జపాను. తర్వాత మంచూకో, జపానులకు ఇద్దరేసి ప్రతినిధులను కావాలన్నది. దీనికి గూడ లిట్వినాఫ్ గట్టిగా జవాబు చెప్పాడు. ఇటు లిట్వినాఫ్ కఠినమైన జవాబూ, అటు మార్షల్ బ్లూషర్ నాయకత్వాన రెడ్ ఆర్మీ సైనికులు తుపాకిగుండ్లతో జవాబూ చెప్పే సరికి జపాను నీళ్లు నమిలి ఈ తాత్కాలిక సంధికి దిగింది.

కాని ఈ సంధి ఎన్నాళ్లు? అసలు ఈ కయ్యాలకు కాలు దువ్వడంలో జపాను ఉద్దేశ్య మేమిటి? ఈ విషయాలు మనం ఆలోచించాలి.

జపాను, చైనాలో ముందడుగు వేయుట లేదు. పైగా చైనా సైన్యాలే అపు డపుడు ఎదురు దంచుతున్నాయి. హాంకో వైపు దాడి అరికట్టబడింది. దక్షిణ చైనాపై దండయాత్ర సాగేటట్లు లేదు. ఒక విధంగా సైన్యాలలో నిరుత్సాహం ప్రబలింది. దేశంలో రోజు రోజూ ఆర్థిక మాంద్యంవల్ల ప్రజలుకూడా నిరుత్సాహ పడుతున్నారు.

అందుకనే జపాను ఒక కొంటెయెత్తుయెత్తింది. ప్రజల, సైనికుల మనస్సు మార్చాలని, ఒక విధంగా ఏర్పడిన మాంద్యాన్ని నశింప జేయాలని తలచింది రష్యాతో గిల్లి కజ్జా పెట్టుకొని, చైనా, మంచూకో, కొరియాలలో తమ సామ్రాజ్యానికి రక్షణ లేకుండా చేస్తున్నది రష్యాయే నని ప్రజలకు చూపెట్టవచ్చు. అదీగాక జకోస్లోవేకియా సన్నద్ధమయ్యే హిట్లరు కూడా ఈ తగవుల పెట్టుకొనమని జపానుకుసలహా ఇచ్చి ఉండవచ్చు.

కాని జపాను కోర్కె నెరవేర లేదు. పది రోజుల్లోనే ఈ ఉత్సాహం అణగిపోయింది. పైగా నష్టమూ అధికంగా



మార్షల్ బ్లూషర్
మా జోలికి వస్తే, ఖబడ్దార్!....

కల్గింది. ఒక ప్రక్క జర్మనీ ఇతరవిధాల అంటే ఆయుధ సహాయం చేస్తాను గాని మరేమీ చేయనని తెల్పింది. ఇక యుద్ధంలో రష్యా లెక్క ప్రకారం జపానువారు 600 మంది చనిపోయారు. 2500 మంది గాయపడ్డారు. జపాను తమ వారు 158 మందే మరణించారని, 740 గురే గాయపడ్డారని చెప్పుకుంటున్నది. జపాను నిజంగా రష్యా చేతిలో దెబ్బ తిన్న దనడానికి మరో రుజువు, జపాను ఆక్రమించిన చెంగ్—కూ-ఫెంగ్ పర్వత ప్రాంతం రష్యావారి స్వాధీనం అగుటే.

జపానుకు జర్మనీ ఏదో రకపు సహాయం చేస్తానని ప్రకటించిన వెంటనే అటు టర్కీ ఊరుకో లేదు. ఒక సెమీ

# బ్రిటిష్ పన్నాగం ఎచ్చు

రష్యా జపాను యుద్ధం—చీనా జపాను యుద్ధం—జకోస్లోవేకియా సమస్య —

అఫీషయల్ పత్రికలో, జపాను చర్యల నేమాత్రం సహింప మంటూ వ్రాశారు. రష్యా టర్కీల సంధియే ఈ ప్రకటనకు కారణం.

ఈ ఘర్షణ వలన జపాను లాభం పొంద లేదు. కాని ఎప్పటి కప్పుడు మళ్ళా పేచీ పెట్టుకోడానికే జపాను తయారుగా ఉంది. దీనికి ఉదాహరణ, లిట్వినాఫ్ విచారణకమిటీలో 5 వ వానిని సూచిస్తే, వద్దనుటే. నల్గు రుండటంలో ఒక నిర్ణయానికి రావడం కష్టం. సరిసమానంగా ఓట్లు రావచ్చు.

కాని రష్యా జాగ్రత్తగా, మెలకువగా ఉంటుంది. జపాను చేతలకు గట్టిగా జవాబు చెప్పే రాజకీయ వేత్త లిట్వినాఫ్ ఉన్నాడు. అవసరమైతే సాయుధుడై జవాబుచెప్పడానికి మార్షల్ బ్లూషర్ ఉన్నాడు. అంతే కాని రష్యా సరిహద్దులలో జపాను పప్పులుడకవు.

## జపాను ప్రగల్భాలు.

రష్యా జపాను యుద్ధం వల్ల జపాను సైనికుల్లో ఒక విధమైన మత్తు గల్గింది. చైనా సైనికుల్లో ఉత్సాహం ప్రబలింది. హూయన్‌గ్‌మీ, సుసాంగ్,లకు పడమట భాగాన చైనాయే తీవ్రమైన దాడి సాగించింది. అక్కడ జపాను స్వరక్షణ బలహీన మయింది.

రష్యాలో సంధి సంప్రదింపులు కాగానే కట్టిపెట్టిన హాంకోపై దండయాత్రను తిరిగి సాగించారు జపానువారు. 50 వేల మందిని హాంకోనుండి వెడలి పొమ్మని జంగ్—కే—షైక్ ఉత్తరు విచ్చాడు. కాని, జపాను హాంకోను జయించే పరిస్థితులలో లేదు గాబట్టి మేము వెళ్ళనవసరం లేదని ప్రజ లంటున్నారు.

హాంకో వైపుకు జపాను సైన్యాలను మరలించడమే గాకుండా, నగరాలపై జపాను బాంబుల వేసి అమానుషంగా వధించుతున్నది ప్రజలను.

వూచాంగ్‌లో జపానువిమానాలు 100వరకూ ఎగరదలచాయి. కాని ప్రకృతి, మేఘాల రూపంగా అడ్డురావడంచేత 60 మాత్రమే ఎగరగల్గాయి. అవి కురిపించిన బాంబుల వల్ల 600 మంది చనిపోయారు. కాలేజీ భవనాలు, స్కౌట్ హెడ్ క్వార్టర్సుపైన బాంబులు పడ్డాయి. కాంటన్‌లో బాంబుల గురిపించడం మూలంగా 296 మంది చనిపోయారు. 399 మంది మరణించారు. 350 ఇండ్లు శిథిల మయాయి. హాంకోలో జపాను బాంబుల మూలకంగా 500 మంది మరణించారు.

ఈవిధంగా ఆమాయక ప్రజల చిత్రవధ గావించినందులకు భారత దేశంలో అసమ్మతి చూపుడని, కాంటన్ నగర మేయర్ కాంగ్రెసు విదేశాంగశాఖ కార్యదర్శి లోహియాకు వ్రాశారు. ఆయన విజ్ఞప్తి ననుసరించి జపాను రాక్షస కృత్యాల ఖండించుతూ అహమ్మదాబాద్-పాట్నాల మ్యునిసిపాలిటీలు తీర్మానించాయి.

ఒక వైపు జపాను హాంకో వైపుకు దాటికి సన్నాహ మవుతుంటే చైనావారు కియూ కియాంగ్‌వద్ద జపాను నౌకలపై విమానాలతో బాంబులు వేశారు. ఇంతే గాదు. కూలింగ్‌వద్ద చైనాను ఎదుర్కొన్న జపాను సైన్యాలను తిరగగొట్టారు. హాంకోను రక్షించు కొనేందుకు తమకు లక్ష మంది సైనికులు కలరని జంగ్-కే-షైక్ ప్రకటించాడు.

మరో ప్రక్క గొరిల్లాలు దిగ్విజయంగా షాంఘేకు 5 మైళ్ల దూరంలో జపాను సైన్యాల జయించి చైనా పతాక నిల్పారు. కాని మళ్లా క్రొత్త సైన్యాలు వచ్చే లోపల, తమ ఎత్తుల ననుసరించి వెనక్కి పోయారు.

ఇలా హాంకో వైపు జపాను దాడి కష్ట మౌతున్నది. అక్కడక్కడ చైనా విజయమే కన్పించు తున్నది. అయినా జపాను ప్రగల్భాలు మానలేదు. జపాన్ ఆర్థిక మంత్రి "ఇకాడా" మాటా

## నేటి ప్ర

డుచూ, జంగ్-కై-షేక్ ఓడిపోయేదాక



జంగ్-కై-షేక్
మా హాంకోను రక్షించడానికి లక్షమంది సైనికులున్నారు....

యుద్ధం చేస్తామని ప్రకటించాడు. చైనాను జయించాక పునర్నిర్మాణంలో ఇతర



# టూ ఫలించుట లేదు.

హిట్లర్ యుద్ధసన్నాహాలు — ముసోలినీ గర్జన — స్పానిష్ యుద్ధం.

రాజ్యాల సహకారం తీసుకుంటాడట, అందుకని, ఆ పరిస్థితు లుదయించక ఉండదే. తాము బ్రిటనుకు అనుకూలమో, ప్రతికూలమో చెప్పరేరట!

కాని, పాపం, ఈ ప్రగల్భాలు ఫలించే సూచనలు లేవు.

## జకోస్లోవేకియా సమస్య ఏమవుతుంది?

రన్సిమన్‌ను రాయబారిగా పంపుటలోని రహస్యం ఇదివరకే వెల్లడించాం. అయినా మరోసారి వెల్లడించం అనవ



డాక్టర్ బీనిస్
జర్మనీ దుష్ప్రచారం చేస్తున్నది...

సరం కాజాలదు. హిట్లర్ బ్రిటన్‌పై ఒత్తిడి తెచ్చాడు తన కనుకూలంగా జక్

## పంచం

సమస్యను పరిష్కరించమని. దానికొరకు రాజుగారి ఫ్రాంసు సందర్శన సందర్భంలో ఆంగ్లో-ఫ్రెంచి సంభాషణలు సాగాయి. ఆ సంభాషణల సారాంశం ఒకటి, బ్రిటన్ ఫ్రాంసులు జకోస్లోవేకియాపై సూడెటెన్ జర్మనులకోర్కె లొప్పుకొనమని ఒత్తిడి తెచ్చుట. రెండు, ఫ్రాన్సు, రష్యాలతో సంధులను రద్దుపరచుకొని, జక్ ప్రభుత్వం న్యూట్రల్‌గా (తటస్థంగా) ఉండాలని, ఆ తటస్థతను కాపాడే బాధ్యత ఫ్రాన్సు, బ్రిటన్, జర్మను, ఇటలీలదని.

కాని ఈ షరతులకు ఫ్రాంసు అంగీకరించక తిరస్కరించింది. అందువల్ల బ్రిటిషు పన్నాగం అంతా భగ్నమయింది.

జకోస్లోవేకియాపై జర్మనీ పత్రికలు దుమ్మెత్తి పోస్తున్నాయి. శాంతికి భంగకరంగా జర్మనీయే అలజడి గావించుతున్నదని జక్ ప్రభుత్వం బ్రాడ్ కాస్టు చేసింది. సూడెటన్ జర్మనులు తమ కోర్కె లేమీ తగ్గించుకునేటట్లు కన్పించదు. పైగా, గత మే నెలనుండి తమ కష్టాలు అభివృద్ధి అయాయంటూ, ప్రభుత్వంపై నిందలు మోపసాగారు.

ఇంతే గాదు. జర్మను విమానం ఒకటి సరిహద్దులదాటి వచ్చి, ఆకాశంలో స్వస్తిక చిహ్నం కన్పడేటట్లు గావించింది. దానికి జకోస్లోవేకియా ప్రభుత్వం అసమ్మతి తెలియజేసింది.

అటానమిస్టు నాయకుడగు జనరల్ హ్లింకాకు జబ్బు చేయడంచేత, ప్రస్తుతం హోడ్జా, ప్రతిపక్ష నాయకులతో సంప్రదింపులు ఆపవలసివచ్చింది. రన్సిమెన్ సెలవులలో గడపవలసి వచ్చింది. సూడెటన్ జర్మనుల వైఖరిని గాని, జర్మనీ వైఖరినిగాని చూస్తే, జకోస్లోవేకియా సమస్య శాంతంగా పరిష్కరింప బడుతుందనుకోవడం శుద్ధ తప్పు.

## హిట్లర్ యుద్ధసన్నాహం చేస్తున్నాడా?

జర్మనీ, ఫ్రెంచి సరిహద్దులలో రక్షణ ప్రయత్నాలు గావించు తున్నదనీ, కోటలు

హిట్లర్
యుద్ధసన్నాహాలు చేస్తున్నాడా?....

వృద్ధి పరచుచున్నదనీ వార్తలు. ఈరక్షణ యుద్ధ సన్నాహాలలో వేలకొలది కార్మికులు పనిచేస్తున్నారు. కాని వారి జీవితం దుర్భరంగా ఉన్నదని జవాబు చెబితే, మార్షల్‌లా క్రింది విచారింప బడుతారు. అందుకని నోరు మెదపకే పనిచేస్తున్నారు. త్వరలోనే 'మేనోవర్స్' (పరీక్ష కోసం, సైన్యాలు నడుపుట, బాంబులు వేయుట మొదలైనవి) కూడా ప్రదర్శించుతారట. బవేరియా, సాక్సోనీ, రైన్‌లాండులలో ఈ సన్నాహాలవలన ప్రజలలో భయం హెచ్చింది. జర్మన్ డిఫెన్సు లా ప్రకారం అవసర మయినపుడు ఆస్తిని మిలటరీ అధికారులకీయాలి. ఇంతేగాక అందరూ యుద్ధానికి తయారుగావలెనని శాసనమూ ఉన్నది.

ఈసరిహద్దుల సన్నాహం ఇతరులకు తెలుస్తుందేమోనని ఫ్రెంచి గనులలో పని చేసే జర్మనీ కార్మికులను పోనీయ లేదు. ఉల్లంఘించి హద్దుల దాటి పోయే వారికి మరణమే శిక్ష అని చెప్పారు జర్మనీవారు.

ఇటు ఫ్రెంచి సరిహద్దులలోనే గాక జకోస్లోవేకియా సరిహద్దులలో గూడ సైన్యాభివృద్ధి చేస్తున్నాడు హిట్లర్.

కాని ఫ్రాంసు అంతగా దీన్నిగురించి భయపడటం లేదు. పత్రికలు గోరంత కొండంతలు జేసాయని వారిఅభిప్రాయం. ఈవిషయమై ఆంగ్ల—ఫ్రాంసు విదేశాంగ మంత్రులు సంభాషించారు. దానిలో ఫ్రెంచి మంత్రి, బ్రిటిష్ పత్రికలే అబద్ధాలు వ్రాస్తున్న వని తెల్పాడు. అయినప్పటికీ ఫ్రాంసుకు తమ కర్తవ్యం తెలుసు గనుక మెలకువగనే ఉన్నారు. స్పానిష్ సరిహద్దులలో కూడ రక్షణకై తీవ్రప్రయత్నాలు గావించుతున్నారు.

కాని హిట్లర్ ఈ సన్నాహం బెదరింపుకు మాత్రమే గాదు. జకోస్లోవేకియా ఇంకా తన పొట్టను బడలేవని అది మరచిపో లేదు.

జకోస్లోవేకియాను మ్రింగదలచిన హిట్లర్ పరిపాలన ఆస్ట్రియాలో ఎలా ఉంది? డిశంబరు 31 లోగా యూదులు ఒక కార్డుకై అప్లయి చేయాలి. అది యూదులను గుర్తింప జేస్తుంది. అవసరమయినప్పుడల్లా దాన్ని చూపెట్టాలి.

ఇలాంటి బాధ పడలేకే 188 ఆస్ట్రియనులు, బ్రిటన్‌లో 'సిటిజన్‌షిప్' పొందారు. అమెరికాలో 'సిటిజన్‌షిప్' కోరుచూ మేడం లాటీ అను ఆమె ఇక చచ్చినా ఆస్ట్రియాకు వెళననది. ఇది చాలదా హిట్లర్ ప్రభుత్వ వైఖరి తెల్పడానికి?

## ముసోలినీ గర్జన.

హిట్లర్ ఈ యుద్ధ సన్నాహాలలో మునిగిఉంటే, ముసోలినీ ఒక గర్జన చేశాడు. "మనకు పిచ్చిభ్రమ లేదు. అం



ముసోలినీ
"మాకు పిచ్చి భ్రమలేదు"...

దరూ యుద్ధసన్నాహాలు గావించుతుంటే, మనం మెదలకుండా కూర్చోడం దోషం" అంటూ.

## స్పానిష యుద్ధం.

స్పానిష్ యుద్ధం తీవ్రంగానే కొనసాగుతూ ఉంది. ఒక వైపు రిపబ్లిక్ విజయ వార్తలూ, మరొప్రక్క విద్రోహుల విజయ వార్తలూ వస్తున్నాయి.

'ఈస్ట్రిమాదురా' వైపు విద్రోహులు దండయాత్ర సాగిస్తున్నారు. గండెసా వద్ద రిపబ్లిక్ దాడి సాగించింది. విద్రోహులు 'సియూదాడ్ రీల్' అనే చోట



జనరల్ ఫ్రాంకో
బ్రిటనుకు జవాబు చెప్పకపోవడంలో దురుద్దేశ్యం లేదు...

కూడ క్రొత్తగా దాడి సాగించారు. ఇ స్పెయిను రిపబ్లిక్‌కు మిగిలిన 8 రా

(మిగతా 15 వ పేజీ)

వైశాఖ మాసం. ఆనాటి మధ్యాహ్నన ఎండ మహా తీక్షణంగా ఉన్నది. ఇక తాపము చెప్ప శక్యమే కాదు. సరిగ్గా ఇలాంటి సమయాన ముఖర్జీల వారి అబ్బాయి దేవదాసు పాఠశాలలో ఒక మూలను చింకి చాప పై కూర్చుని, కళ్లు మూస్తూ తెరుస్తూ, కాళ్ళు చాపి, పలక క్రింద పెట్టి, ఆవలించి, చివరకు మహా ఆలోచనలో పడిపోయాడు. పడి, ఇలాంటి చక్కటి సమయాన గాలిపటం ఎగరవేసుకుంటూ పొలాల మీద తిరగటానికి బదులు పాఠశాలలో కట్టుబడి వుండడం ఏమాత్రం మంచిది కాదని స్థిరపరుచుకున్నాడు. ఉర్వరమస్తిష్కంలో చప్పున ఒక యుక్తి కూడా అంకురించింది. పలక చేత పుచ్చుకుని లేచి నిలబడినాడు.

ఇప్పుడు మధ్యాహ్న భోజనానికి బడి వదలి పెట్టారు. పాఠశాలకు సమీపంలోనే ఉన్న మర్రి చెట్టు క్రింద పిల్లలు గోల చేస్తూ బిళ్ళగోళ్ళు ఆడుతున్నారు. దేవదాసు ఒకమాటు అటు చూశాడు. మధ్యాహ్న భోజనానికి అతన్ని వదిలి పెట్టరు. ఎందు కంటే, బడి నుంచి బయటపడిన తర్వాత, మరల దానిలో ప్రవేశించటానికి దేవదాసు ఎంత మాత్రమూ ఇష్ట పడడని గోవింద పండితుడు అనుభవం మీద గ్రహించాడు. పైగా అతని తండ్రి నిషేధం కూడా ఉన్నది. ఈ కారణా లన్నిటిచేతా, అతను, ఈ సమయంలో బడి పెద్ద "భోలా" అవార్తిలో ఉండవలసి వచ్చింది.

పాఠశాల్లో ఇపుడు పంతులు గారు ఒక్కరు మాత్రం మధ్యాహ్నపు అలసటచేత కళ్ళు మూసుకొని పండుకొని ఉన్నారు. బడి పెద్ద భోలా ఒక మూలను వీపూ కాళ్ళూ విరిగిన బెంచీ మీద చిన్న పంతులు గారి ఠీవితో కూర్చుని, మధ్య మధ్య మహా నిర్లక్ష్యంగా ఒకమాటు పిల్లలకేసి చూస్తూ మరో మాటు దేవదాసూ పార్వతుల మీద యాదృచ్ఛికంగా ఒక చూపు పారవేస్తూ ఉన్నాడు. పార్వతి రెండు మూడు మాసాల క్రిందటనే పంతులు గారి అదుపు ఆజ్ఞలలోకి వచ్చినది. బహుశా, ఈ కొద్ది కాలం లోనే పంతులు గారు ఆ పిల్ల మనస్సును రంజింప జేసి ఉండవచ్చును. అందుచేతనే, ఆ పిల్ల ఏకాగ్ర చిత్తంతోనూ, నిరతిశయ ధైర్యంతోనూ నిద్రిస్తూ ఉన్న పంతులు గారి చిత్రాన్ని బాలశిక్ష చివరి పేజీ మీద సిరాతో గీస్తూ అప్పు డప్పుడు, దక్ష చిత్రకారిణీ వలె—తాను మహా శ్రద్ధతో గీస్తూ ఉన్న చిత్రంలో తన ఆశయా లెంతవరకు ఫలించాయా అని—అటూ ఇటూ వంగి చూస్తూ ఉన్నది. ఎక్కువ ఫలించిం దనటానికి వీలు లేదు; కాని అంతకే పార్వతి మహా ఆనందమూ, తృప్తీ అనుభవిస్తూ ఉన్నది.

ఈ సమయంలోనే దేవదాసు పలక చేత పుచ్చుకొని లేచి నిలబడి, భోలాను ఉద్దేశించి బిగ్గరగా—"లెక్క కుదరటం లేదు." అని అన్నాడు.

"ఏ లెఖ్ఖ?" అని భోలా శాంత గంభీర స్వరంతో అడిగాడు.

"మణుగు లెఖ్ఖ—"

"పల కేదీ—"

దీని అర్థం ప్రతి విషయానికీ పలక తనకు తెచ్చి చూపించమని. దేవదాసు పలక చేతి కిచ్చి దాపునే నిలబడ్డాడు. భోలా బిగ్గరగా అంటూ వ్రాయ నారంభించాడు:

"ఒక మణుగు నూనె ధర పద్దానుగు రూపాయలా, తొమ్మి దణాలా, మూడు పైస లైతే—"

ఈ సమయంలోనే ఒక ఘటన ఘటిల్లింది. కాళ్ళూ వీపూ విరిగిన ఈ బెంచీని, బడి పెద్ద భోలా తన పదవికి తగిన ఆసనంగా నిర్ణయించుకుని, నియమం తప్పకుండా ఇప్పటికి మూడు సంవత్సరాల నుంచీ కూర్చుంటూ వస్తున్నాడు. బెంచికి వెనక ఒక పొడి సున్నపు రాసి ఉన్నది. పంతులు గారు దీన్ని ఎప్పుడో, ఏ యుగంలోనో చౌక ధరకు కొని అట్టే పెట్టారు. రోజులు సవ్యంగా ఉంటే దీనితో గట్టికొంప వేయించాలని వీరి ఉద్దేశము. ఆ శుభ ముహూర్తం ఎప్పుడు వస్తుందో తెలియదు కాని, ఈ శ్వేత చూర్ణం మీద వీరికి శ్రద్ధా, మాయా మాత్రం విపరీతంగా ఉండేది. ఆసహాయ చర్ములూ, ప్రపంచ జ్ఞాన శూన్యులూ అయిన విద్యార్థులు దీనిలో ఒక్క రేణువు కూడా నష్టం చేయకుండా ఉండగలందులకు, తనకు ప్రియ పాత్రుడూ, అందరిలోకీ వయసుకు కొంచెం పెద్ద అయిన భోలా నాథునికి—దాను మహా యత్నంతో కూడబెట్టిన వస్తువును—జాగ్రత్తగా కని పెట్టి ఉండే భారం వప్పగించాడు. అందుచేతనే భోలా ఈ బెంచీ మీద కూర్చుంటూ ఉండే వాడు.

భోలానాథుడు వ్రాస్తున్నాడు:— ఒక మణుగు నూనె ధర పద్దానుగు రూపాయలా తొమ్మి దణాలా మూడు పైస లైతే—అమ్మ నాయనో!— తర్వాత పెద్ద గందరగోళం అయింది. పార్వతి బిగ్గరగా చీత్కారం చేసి, చప్పట్లు కొట్టుతూ నేల మీద పొర్ల నారంభించినది. నిద్రా భంగం కావటంచేత, గోవింద పండితుడు రక్త నేత్రాలతో చిప్పుక్కుమని లేచి నిలుచున్నాడు. చెట్టు క్రింద ఉన్న పిల్లలు వరుసగా నిలబడి 'భక్ భక్' మంటూ పరుగెత్తుతూ వీరి కంట పడ్డారు. అటు నుంచి దృష్టి మరల్చి పాఠశాలలో చూశాడు—విరిగి పోయిన బెంచీ మీద ఒక జోడు కాళ్ళు ఆడుతూ ఉన్నాయి; సున్నం మధ్యలోంచి అగ్నిపర్వతంలోంచి వచ్చినట్టుగా పొగ వస్తూ ఉన్నది.

"ఏంటి? ఏంటి?" అని వారు కేక పెట్టారు.

చెప్పటానికి అక్కడ మిగిలిం దల్లా పార్వతి. కాని, ఇంకా ఆ పిల్ల నేల మీద పొర్లుతూ చప్పట్లు కొట్టుతూ ఉన్నది. పంతులు గారి విఫల ప్రశ్న, క్రుద్ధ భావంతో—"ఏమిటి? ఏంటి? ఏంటిరా?" అని తిరిగి వచ్చింది. తర్వాత శ్వేతమూర్తి భోలానాథుడు సున్నం పడ నెట్టుకొని లేచి నిలబడ్డాడు. పంతులు గారు మరల చీత్కారం చేశారు:

"కోతి వెధవ! నువ్వేనా దాంట్లో?"

"ఊఁ — ఊఁ — ఊఁ —"

"మళ్ళీ?"

"దేవాయ్—పడేసి—ఊఁ, ఊఁ — మణుగులెఖ్ఖ—"

"పైగా పితుర్లా?"

కాని తర్వాత సంగతంతా గ్రహించి చాపమీద కూర్చుని "దేవాయ్ పడేసి పారిపోయాడా?" అని అడిగాడు.

"ఊఁ, ఊఁ, ఉఁ!" అని భోలా పెద్ద పెట్టున ఏడ్చాడు.

తర్వాత కాసేపు సున్నం దులిపారు. కాని తెలుపు పూర్తిగా పోక పోవడంచేత నల్లని భోలా భూతం మాదిరిగా కనిపించ నారంభించాడు. అప్పటికీ వాడి ఏడుపు తగ్గలేదు.

"నిజంగా దేవాయేనా పడేసి పారిపోయింది?" అని పంతులు అడిగాడు.

"ఊఁ, ఊఁ—"

"వాడి పని చెపుతాలే!"

"ఊఁ— ఊఁ—"

"మిగతా వెధవ లేరీ?"

పిల్లలు కొందరు జేవురించిన ముఖాలతో రొప్పుకుంటూ వచ్చి దేవదాసు చిక్కలేదని చెప్పారు.

ఒకడు—'అబ్బా, రాయి ఎంత గురిగా—'

పంతులు—'చిక్కనే లేదా?'

ఇంకో కుర్రవాడు వెనకటి వాడి మాటనే ప్రతి ధ్వనించ బోయాడు: 'అబ్బా రాయి—'

'నువ్వూరు కోరా వెధవా—'

వాడు మాట దిగమింగి పక్కకుపోయి నిలబడ్డాడు. నిష్ఫల క్రోధం చేత మొదట పంతులు పార్వతిని బెదరించాడు. తర్వాత, భోలా నాథుని చేయి పట్టుకొని—'పద, ఒక మాటు కచేరీ చావిడికి పోయి కనపడి వద్దాము' అన్నాడు.

దీని అర్థం ఏమిటంటే, జమీందారు నారాయణ ముఖర్జీగారి దగ్గరికి పోయి వారి కొడుకుమీద ఫిర్యాదు చేద్దామని.

అప్పుడు మూడు గంటలై ఉంటుంది. జమీందారు నారాయణ ముఖర్జీగారు పంచిపాళిలో కూర్చుని హుక్కా తాగుతున్నారు. భృత్యుడొకడు విసన కర్రతో విసురుతున్నాడు. విద్యార్థులను వెంట పెట్టుకొని వేళకాని వేళను పంతులు రావడంచూసి నారాయణ బాబు కొంచెం విస్మితుడై—'గోవిందుడా?' అని అన్నాడు.

గోవిందుడు కాయస్థుడు. నేలకు వంగి నమస్కరించి, భోలాను చూపించి సంగతంతా సవిస్తారంగా వర్ణించాడు.

ముఖర్జీగారు విరక్తుడై—'ఇది చూస్తే దేవాయ్ చెయ్యి మిగిలి పోయే టట్టుగా ఉన్నాడు!' అన్నాడు.

దే వ

శ ర త్

వి ర

'ఏమి చేయమంటారో తమ

నారాయణబాబు హుక్కాగ
వెళ్లాడు?' అని అడిగాడు.

'నా కెలా తెలుసునండీ? పట్టి
డట.'

కాసేపు ఇద్దరూ మాట్లాడలే
వచ్చాక ఏదో వొకటి చేస్తా'నని చెప్పి

గోవింద పండితుడు కుర్రవా
వచ్చి, కళ్లతోనూ, ముఖంతోనూ,
కాయల నందరిని భయపెట్టి—దేవదా
రయితే అయ్యాడు. కాని వ
ప్రతిజ్ఞ చేశాడు. ఆ రోజున బడి మా
వదిలిపెట్టాడు. దోవను వెళ్లేటప్పుడు
నారంభించారు.

ఒకడు—అబ్బ! దేవాయి ఎ
ఇంకొకడు—భోలాకు బాగా
మరొకడు—అబ్బ ఏం గురి
వేరొకడు భోలాను సమర్థిం
వాడిపని పడతాడు.'

'హుష్, వాడిక బళ్లోకి వస్తే

"చ క

—అను

ఈ పిల్లల గుంపుకు ఒక వ
కాని పార్వతికూడా ఇంటికి వస్తూ
నున్న కుర్రవాడి చేయి పట్టుకుని—
బళ్లోకి రానివ్వరా?' అని అడిగింది,

'ఉహుఁ అసలు అడుగు పె

పార్వతి ఎడంగా పోయింది
లేదు. పార్వతి తండ్రి పేరు నీలకంఠ
అంటే ముఖర్జీగారి పెద్ద మేడకు
వీరికి పది పన్నెండు ఎకరాల పొలం
దారుగారితో లావాదేవీలు కూడా
హాయిగానే గడుపుతున్నాడు.

పార్వతికి మొట్ట మొదట
గారింట నౌకరు. పదో మాసం
దేవదాసును వదలకుండా ఉంటున్నా
వాడు—బడి వదిలే సమయానికి హాజ
ఈ నియమం అతను అతిక్రమించేవ
వెళ్లతున్నాడు.



దా సు

బా బు

ిత ం

రే సెలవివ్వండి.'

'ట్టం క్రిందపెట్టి—'వాడు ఎక్కడికి

కోపోయిన వాళ్లను రాళ్లతో కొట్టా

. తర్వాత నారాయణబాబు 'ఇంటికి
పంతుల్ని పంపించాడు.

ని చేయి పట్టుకొని పాఠశాలకు తిరిగి
నానావిధ భావభంగులతోనూ పిల్ల
ను తండ్రి ఈ ప్రాంతానికి జమీందా
క్షం ఇ అడుగు పెట్టనివ్వనని
మూలుకంటే కొంచెం ముందుగానే
కుర్రవాళ్లు ఈ విషయమే చర్చింప

ంత పొగరుబోతురా!
బుద్ధి చెప్పారురా!
రా!
వాడు: చూస్తారుగా, భోలా తప్పక

ా ఏమన్నా చేయటానికి?'

పా ణి"

వాదం

క్కగా పలకా పుస్తకాలూ చేత పట్టు
న్నది. ఈ సంభాషణ విని దగ్గర
మణీ! దేవదాదాసును ఇక నిజంగా

ట్టనివ్వరు.' అన్నాడు మణి

ఈ సమాధానం ఆ పిల్లకేమీ బాగుండ
చక్రవర్తి. జమీందారుగారికి పొరుగు
పక్కనే—వీరి చిన్న పురాతనపు దాబా
నాలుగైదిళ్ల పౌరోహిత్యం, జమీం
ఉన్నవి. స్వాతంత్ర్య ప్రియుడు—కాలం

ుడను కనపడ్డాడు. వాడు దేవదాసు
ది. ఈ పన్నెండో సంవత్సరం వరకు
వేళకు పాఠశాలలో వదిలిపెట్టే
పైగా మరల ఇంటికి తీసుకు వచ్చేవాడు.
డు కాదు. ఇవ్వాళ అందుకనే బడికి

'ఏడీ, పారూ! మీ దేవదాదా ఏడీ?' అని పార్వతిని చూడగానే ప్రశ్నించాడు.

'పారిపోయాడు.'

ధర్మదాసుకు మహా ఆశ్చర్యం కలిగింది.

'పారిపోవటం ఏమిటీ?'

పార్వతికి మళ్ళీ భోలానాథుని దుర్దశ తలుపుకువచ్చి సరి కొత్తగా నవ్వ నారంభించింది. — 'ఇదిగో ధర్మదా—హీ, హీ, హీ—ఒక్క మాటే సున్నపు గుట్టలో—హీ,హీ—హూహూ—ఒక్క మాటే ధర్మా, చిత్తుగా—'

ధర్మదాసుకు ఏమీ అర్థం కాకపోయినా పార్వతి నవ్వటంచూసి తాను కూడా మొదట నవ్వాడు. తర్వాత నవ్వు నాపుకొని—'చెప్పు, పారూ! ఏమయింది?' అని బ్రతిమాలాడు.

'దేవదా వెనక్కు పడేసి—భోలాని—సున్నపు గుట్టలో—హీ, హీ—' ధర్మదాసు ఈ మాటు మిగతా దంతా గ్రహించి చాలా చింతితుడయాడు.

'పారూ! ఇప్పుడు వాడెక్కడ ఉంటాడో ఎరుగుదువా?'

'నాకేం తెలుసు!'

'నీకు తెలుసులే చెప్పుదూ! పాపం చాలా ఆకలి కొన్నాడను కుంటాను'

'ఆ మాట నిజమే—కాని నేను చెప్పను.

'ఎందుకని చెప్పవే?'

'చెప్తే నన్ను కొడతాడు. నేనే ఏదన్నా తీసుకెళ్లి ఇచ్చి వస్తాను.'

ధర్మదాసుకు కొంతవరకు సంతృప్తి కలిగింది.

'అలాగే ఇవ్వు. కాని సాయంకాలం లోపల ఎలాగన్నా మైమపుచ్చి ఇంటికి తీసుకురా.'

'తీసుకొస్తానులే!'

పార్వతి ఇంటికి చేరుకోకముందే ఈ సంగతి ఆమె తల్లికీ దేవదాసు తల్లికీ తెలిసింది. వాళ్లు మళ్ళీ పార్వతిని అడిగారు. కాసేపు నవ్వుతూనూ, కాసేపు గంభీరంగానూ తన చేత నయినంతవరకు వర్ణించింది. తర్వాత కొంగున మరమరాలు కట్టుకుని జమీందారుగారి మామిడి తోపుకు బయలుదేరింది. తోట వీరింటికిదాపే. దాంట్లో ఒక మూలను వెదురు గుమ్మె ఉన్నది. చాటుగా పుగాకు తాగటం కోసరం దేవదాసు అందులో కాస్త చోటుకూడా శుభ్రంచేసుకు అట్టే పెట్టుకున్నాడు. వాడు పారిపోయినప్పుడు, దాక్కునే చోటు ఇదేననికూడా పార్వతికి తెలుసును. అంచేత పార్వతి సరాసరి అక్కడికి వెళ్లింది. దేవదాసు వెదురు గుమ్మెలో కూర్చుని విజ్ఞుని మాదిరిగా ధూమపానం చేస్తున్నాడు. ముఖం గంభీరంగా ఉన్నది—దానిలో దురాలోచనా చిహ్నాలుకూడా స్పష్టంగా కనిపిస్తున్నాయి. పార్వతిని చూడగానే అతనికి సంతోషము కలిగింది. కాని, దానిని బయటకు కనపడ నివ్వలేదు. పొగ వదులుతూ—'ఇలారా!' అని గంభీరంగా అన్నాడు.

పార్వతి దగ్గరకు వచ్చి కూర్చున్నది. దేవదాసు దృష్టి ముందుగానే చెంగున ఉన్న మూటమీద పడింది. ఇక ఏమీ ప్రశ్నించకుండా మూట విప్పి తిన మొదలు పెట్టి—'పారూ! పంతులు ఏమన్నాడే?' అని అడిగాడు.

'పెద బాబుతో వచ్చి చెప్పాడు.'

'నాన్నకు చెప్పాడా?' అన్నాడు దేవదాసు గుడ్లు పెద్దవిచేసి.

'ఆఁ.'

'తర్వాత?'

'నిన్నిక బళ్లోకి రానివ్వడట!'

అసలు ఎవడు పోకూర్చున్నాడు!

తిను బండారం పూర్తిగా వచ్చింది; దేవదాసు పార్వతి ముఖంకేసి చూసి 'మిఠాయిలేవీ' అన్నాడు.

'మిఠాయి తీసుకురాలేదు.'

'అయితే నీళ్లివ్వు.'

'నీళ్లెక్కడ తెచ్చేది?'

'ఏమీ లేకుండా ఎందుకు వచ్చావు? ఫో, నీళ్ల తీసుకురా!' అన్నాడు విసుక్కుంటూ. అతని కర్కశ స్వరం పార్వతికి బాగుండలేదు.—'నేను మళ్ళీ పోలేను. నువ్వే తాగివద్దువుగానిరా.' అన్నది.

'నేనిప్పుడు రాగలనా?'

'మరి ఇక్కడే ఉండి పోతావా?'

"ఇక్కడే ఉంటాను—తర్వాత ఎటో అటు వెళ్ళిపోతాను."

దేవదాసు శ్మశాన వైరాగ్యం చూసేవరకు పార్వతి కళ్ళల్లో నీరు తిరిగింది. అతని మాటలు ఈ పిల్ల మనస్సును కలచి వేశాయి—"నేను కూడా వస్తాను, దేవదాస్!"

"ఎక్కడికీ? — నా వెంటా? — అదెలా?"

పార్వతి తల తిప్పుతూ—"నేనూ వస్తానుగా!" అన్నది.

"ఉహుఁ, రా నక్కర లేదు. ముందు నువు నీళ్ళు తీసుకురా."

"నేనూ వస్తాగా!" అన్నది పార్వతి మళ్ళీ పూర్వం మాదిరిగానే.

"ముందు నీళ్ళు తీసుకురా!"

"నేను పోను—నువ్వు పారిపోతావు."

"అబ్బే, పారిపోను."

కాని పార్వతికి ఈ మాట మీద విశ్వాసం కుదుర లేదు. అందుచేత అక్కడి నుంచి కదల లేదు.

"ఫో, చెప్తుంటే!" దేవదాస్ హుకు మిచ్చాడు.

"నేను పోలేను."

దేవదాసు కోపంతో, పార్వతి జుట్టు పట్టుకు లాగి—"ఫో చెప్తుంటే!" అని గద్దించాడు. పార్వతి మాట్లాడ లేదు. తర్వాత వీపు మీద ఒక గుద్దు పడింది.

"పోవా?"

"నే నెంత మాత్రం పోను." అన్నది పార్వతి ఏడుస్తూ.

దేవదాసు అక్కడి నుంచి లేచి వెళ్ళిపోయాడు. పార్వతి ఏడుస్తూ తిన్నగా దేవదాసు తండ్రి దగ్గరకు వచ్చి నిలబడింది. ముఖర్జీ గారికి పార్వతి అంటే చాలా ప్రేమ. "పారూ! ఎందు కమ్మా ఏడుస్తున్నావు?" అని బుజ్జగిస్తూ అడిగాడు.

"దేవదా కొట్టాడు."

"వా డేడీ?"

"ఆ వెదురు గుమ్మెలో కూర్చుని పొగ తాగుతున్నాడు."

అసలు పంతులు గారు వచ్చినప్పటి నుంచే వారు ఉడికి పోతు న్నారు—ఈ మాట వినగానే భగ్గు మన్నారు—"దేవాయి పొగ కూడ తాగుతున్నాడా?"

"ఆఁ, తాగుతున్నాడు. రోజూ తాగుతున్నాడు. హుక్కా ఆ వెదురు గుమ్మెలో దాచి పెట్టాడు—"

"ఇన్నాళ్ళ నుంచీ ఎందుకు చెప్ప లేదు?"

"దేవదా కొడతాడని."

ఈ మాట యదార్థం కాదు. వెల్లడిస్తే దేవదాసుచేత దెబ్బలు తినాల్సివస్తుం దనే భయం పార్వతికి ఎప్పుడూ లేదు. దేవదాసుకే దెబ్బలు తగులుతా యని ఇన్నాళ్ళ నుంచి దాచింది. ఇవ్వాళ ఆ ఉడుకు మీద వెళ్ళ గ్రక్కింది. ఇప్పుడు ఆ పిల్లకు ప్రాయం కూడా ఎంత? ఎనిమి దేళ్ళు సరిగ్గా నిండ లేదు. ఇంకా కోపం చాలా ఎక్కువ. అలాగని ఆ పిల్లకు వివేచనా శక్తి లేదనటానికి వీల్లేదు. ఇంటికి పోయి పక్క మీద పండుకొని చాలాసేపు ఏడ్చి ఏడ్చి నిద్ర పోయింది. ఆ రాత్రి అన్నం కూడా తిన లేదు.

# కాంగ్రెసు నుండి సోషలిస్టులను తరిమే ప్రయత్నాలా ఇవి? ★ ★

## పికెటింగు హింసయా?

ఒక వర్గం మరొకవర్గాన్ని, ఒక దేశం మరొకదేశాన్ని, దోచుకొనే దౌర్జన్య విధానాన్ని నిర్మూలించి, వర్గపోరాటములు లేకుండా శాశ్వతమైన శాంతి సౌఖ్యాలతో తులతూగే ఒక కొత్త సమాజాన్ని నిర్మించుట సోషలిస్టుల ఆదర్శం.

పీడించబడే ఒక వర్గంగాని, ఒక దేశంగాని స్వాతంత్ర్యం కొరకు పోరాటం చేయునప్పుడు సోషలిస్టులు వారి స్వాతంత్ర్యాన్ని హరిస్తూన్న ప్రభుత్వపు హింసా విధానాన్ని ఖండిస్తారు.

భారతదేశంలో సోషలిస్టులు కాంగ్రెసులో వారే కాబట్టి, కాంగ్రెసు అవలంబిస్తూన్న శాంతియుత పద్ధతులకే కట్టుబడి యుంటారు.

గాంధీగారు "అహింస"ను గురించి ఎన్నో సార్లు ఎన్నో వ్యాఖ్యానములు చేయడం ఎరుగుదుము. కాని, ఇటీవల పికెటింగును గురించి ఆయన యిచ్చిన అభిప్రాయాలు ఆశ్చర్యాన్ని కలుగజేయక మానవు.

"కార్మికులు పనికి పోకుండా వారియెదుట నిలబడి ఆటంకపరచుట 'కత్తిలేని హింస' అట్టి పద్ధతిని విడిచి పెట్టవలసి యున్నది. అప్పుడు మిల్లులయొక్కగాని, ఇతర ఫ్యాక్టరీలయొక్కగాని, యజమానులు పోలీసువారి సహాయం కోరుటలో తప్పేమీలేదు. కాంగ్రెసు వాదులు యీ విషయంలో తగిన సహాయం చేయలేక పోయినప్పుడు కాంగ్రెసు ప్రభుత్వం పోలీసుల సహాయాన్ని ఈయాలి. అది వారి విధి" అని "హరిజన్" పత్రికలో గాంధీగారు వ్రాశారు.

కనుక కాంగ్రెసులో ప్రజల ప్రాథమిక హక్కులను ప్రకటిస్తూ చేయబడిన తీర్మానములో కార్మికులు పికెటింగు చేసుకొనేహక్కు కూడా చేర్చబడింది.

ఉప్పు సత్యాగ్రహం రోజులలోనూ, శాసనోల్లంఘన సోద్యమంలోను కాంగ్రెసు వాలంటీర్లు విదేశీ బట్టల దుకాణముల యెదుట, కల్లు దుకాణముల యెదుట నిలబడి శాంతి యుతంగా పికెటింగు చేశారు. గాంధీ—ఇర్విన్ ఒడంబడికలో గాంధీగారు కోరిన షరతులలో ఒకటి శాంతియుతమైన పికెటింగు హక్కు. అట్టి పికెటింగు హక్కు నేడు కార్మికులకు లేకుండా చేయుటకు గాంధీగారు ప్రయత్నిస్తున్నారు.

బ్రిటిషు ప్రభుత్వంతో పోరాటం సల్పునప్పుడు పికెటింగు చేయవచ్చునుగాని, దేశియ మిల్లు యజమానుల ఎదుట చేయరాదనా? వారు కాంగ్రెసు ఉద్యమానికి విరివిగా ధన సహాయం చేసినమాట నిజమే. కాని వారి క్రింద పనిచేయు కార్మికులకు ఎట్టి యిబ్బందులూ లేవని గాంధీగారు చెప్పగలరా? జీతములు కోత, పనినుండి తొలగించడం, ఫ్యాక్టరీ ఆక్టును ఉల్లంఘించుట—యీ మొదలైన హింసాయుత పద్ధతుల కార్మికులు సహించలేక, రాయబారములన్నీ విఫలమైనప్పుడు, సమ్మె చేస్తారు. సమ్మె నెగ్గించుకొనుటకు శాంతియుతంగా పికెటింగు చేస్తారు. అట్టి పికెటింగును దౌర్జన్యపు నేరము లాగోసించి పోలీసులు యిప్పుడే అరెస్టు చేస్తున్నారు. ఈ "హింసను" నిరోధించుటకు బదులు గాంధీగారు తన వ్యాసం ద్వారా ప్రోత్సాహం కూడా యిస్తున్నారు.

హింసా విధానంతో పుట్టి, హింసా విధానంలో పెరిగిన పోలీసులు చేసే ఎస్టులు, లాఠీ ఛార్జీలు, కాల్పులలోని "హింస" సిద్ధాంతాన్ని వ్యతిరేకించ కుండా నిస్సహాయులైన పికెటింగుదారులను "కత్తిలేని హింస" అంటున్నారు.

చీరాల కాల్పుల సందర్భంలో మిల్లు యజమానులు, పోలీసులు జరిపిన దౌర్జన్యాలను గాంధీగారు ఖండించలేదు. సంఘ షరతులను భగ్నం చేస్తూన్న కాన్పూరు మిల్లు యజమానుల పైఖరిని విమర్శించనైనా విమర్శించలేదు. అవల, సరిహద్దులో, నిత్యమూ బ్రిటిషువారు బాంబులతోనూ, మర ఫిరంగులతోనూ జరుపుతూన్న హత్యాకాండను గురించి మౌనం వహించారు. ప్రభుత్వంవారి ఈ హింసా విధానాన్నంతటినీ ఖండించక, నిరాయుధులైన పేద కార్మికుల పికెటింగు హక్కుపై దాడి సల్పుట ఏ మాత్రమూ "అహింస" అనిపించుకోదు. ఆకలిమంటచే హాహాకారములు చేస్తూన్న కార్మికులకు మాత్రం గాంధీగారి యీ వింత తత్వం అర్థంకాదని చెప్పవచ్చును.

కార్మికుల హక్కులకై పోరాడే కాంగ్రెసు సోషలిస్టులను "అహింస" అనే ఆయుధంతో కాంగ్రెసు నుండి వెడలగొట్టుట గాంధీగారి అభిప్రాయం కాబోలు!

## ఆంధ్రదేశంలో "అహింస"

ఆంధ్రదేశంలో "అహింస"ను కాపాడడానికి రాష్ట్ర కాంగ్రెసు నాయకులు 4 గురు సోషలిస్టులను కాంగ్రెసు కమిటీల నుండి తొలగించారు. వివిధ గ్రామ, తాలూకా, జిల్లా కాంగ్రెసు కమిటీలు ఈ డిసిప్లినరీ చర్యల యెడల అసమ్మతిని ప్రకటిస్తూ తీర్మానించాయి. 7-8-38 వ తేదీని అల్లూరి సత్యనారాయణగారి స్థానే రా॥ కాం॥ కమిటీ సభ్యత్వానికి ఎవరూ దరఖాస్తులు చేయలేదు. డిసిప్లినరీ చర్యలను రద్దు చేయవలసిందని సుమారు 20 గ్రామాల నుంచి టెలిగ్రాములు, లేఖలు పంపబడ్డాయి.

ఈ ప్రజాభిప్రాయాన్ని రాష్ట్ర కమిటీ అధికార్లు మన్నించకుండా, 12-8-38 వ తేదీని వెంకటగిరిలో జరిగిన రా॥ కాం॥ కమిటీ సమావేశంలో అల్లూరి సత్యనారాయణగారి స్థానే అ. ధా. కాం. కమిటీ స్థానానికి ఎన్నికలు జరిపారు. మొట్టమొదట, డిసిప్లినరీ చర్యలకు సంబంధించిన కాంగ్రెసు నియమావళిని డాక్టర్ పట్టాభిగారు చదివి వినిపించారు. కాని, యీ నియమాలు ఆం. రా. కాం. కమిటీకి పై కమిటీ అయిన అ. భా. కాం. కమిటీలో సభ్యులకు వర్తించవని సుందరయ్య (ఆం. రా. కాం. సోషలిస్టు పార్టీ కార్యదర్శి) గారు వాదించారు. వర్కింగు కమిటీ ముందు యీ డిసిప్లినరీ చర్యలను గురించి అప్పీళ్లు దాఖలు చేయబడి ఉన్నాయి. కాబట్టి, వాటిపై తీర్పు వచ్చేవరకు ఆయినా ఎన్నికను ఆపుచేయ వలసిందని సుందరయ్యగారు "పాయింట్ అఫ్ ఆర్డర్" తీసుకు వచ్చారు. తనకు పైనుండి "స్టే ఆర్డర్లు" రాలేదు కాబట్టి, ఆపుటకు వీల్లేదని పట్టాభిగారు జవాబు చెప్పారు. అయినప్పటికీ సభ్యుల అభిప్రాయం వోటుకు పెట్టారు.

వర్కింగ్ కమిటీవారి నిర్ణయం రాకుండా జరుపబడుతూన్న ఈ యెన్నికయెడల అసమ్మతిని ప్రకటిస్తూ సుందరయ్యగారు ఉపన్యసించారు. విచారణ లేకుండా సత్యనారాయణగారి వంటి నిష్కళంక దేశసేవకులపై డిసిప్లినరీ చర్య తీసుకొనుట అండమాన్ దీవులకు పంపడం వంటిదేనని అన్నాప్రగడ కామేశ్వరరావుగారు ఉద్రేక పూరితంగా మాట్లాడుతూ సభను విడిచి వెళ్ళిపోయారు. వీరియువురితోను మరి కొందరు సభ్యులు కూడా వోటింగులో పాల్గొనక బయటికి వచ్చారు. ఎన్నికను ఆపియుంచవలసినదనుప్రతిపాదనను వోటుకుపెట్టగా 21 మంది అనుకూలముగాను, 34 గురు వ్యతిరేకం గాను, వోటుచేశారు. సుందరయ్య, కామేశ్వరరావుగార్ల ఉపన్యాసం విని, కల్లూరి సుబ్బారావు గద్దే రంగయ్యనాయుడుగార్లు తమ దరఖాస్తులను ఉపసంహరించు కొన్నారు. పార్థసారధిగారు ఏకగ్రీవంగా ఎన్నుకొనబడినట్లు ప్రకటించబడింది. డిసిప్లినరీ చర్యలను గురించి విచారించుటకు ఒక ఉపసంఘమునైనా నియమించక తీర్పుచెప్పుట రాష్ట్ర వర్కింగు కమిటీ యొక్క పక్షపాత వైఖరిని స్పష్టంగా తెలియజేస్తుందనియు, దేశాన్ని ఎదుర్కొంటూన్న అనేక క్లిష్టసమస్యలను పరిష్కరించుటలో వర్కింగ్ కమిటీవారు సోషలిస్టుల సహాయాన్ని తీసుకొనుటకు బదులు వారిని దూరం చేసుకొనుట ఏమాత్రమూ వివేకము కాదంటూ సుందరయ్యగారు సుమారు అరగంట సేపు ఉపన్యసించారు.

గత కాంగ్రెసు కమిటీ ఎన్నికలలో సోషలిస్టులను, ఇతర తీవ్రవాదులను ఓడించుట కెన్ని దౌర్జన్యాలో జరిగాయి. అహింసా సిద్ధాంతం మట్టిలో కలిసి పోతోంటే, రక్షించే నాథుడు లేకపోయాడు. ఇప్పుడు 4 గురు సోషలిస్టులను కాంగ్రెసు కమిటీలనుండి తరిమి వేయుటకు మాత్రం "అహింసా" సిద్ధాంతం ఉపయోగపడింది!

## మన రాజకీయాలు.

## యు. పి. లో కూడ యిదే ధోరణి.

యు. పి. రాష్ట్రంలోకూడా సోషలిస్టులను తొలగించుటకు పూనుకొన్నారు. అలహాబాద్‌లో అ. భా. కాం. కమిటీ ఆఫీసులో జడ్. ఎ. అహమ్మద్‌గారు ఆర్థిక, రాజకీయ శాఖలను, లోహియాగారు విదేశాంగ శాఖను సుమారు మూడు సంవత్సరములనుండి కార్యదర్శులుగా ఉండి అనేక కరపత్రాలు, గ్రంథాలు వ్యాసాలు ప్రకటించారు. విదేశాలతో మన సంబంధం హెచ్చింది. కాని, వారు కాంగ్రెసు సోషలిస్టుపార్టీ సభ్యులు: అదీ, వారు చేసిననేరం. వారు వ్రాసిన గ్రంథాలలో కంచు కాగడవేసి వెదికినా, కాంగ్రెసుకు వ్యతిరేకమైన వాక్యం ఒక్కటీ కనపడదు. అయినప్పటికీ, వారు తమ పార్టీకి రాజీనామా అయినా ఈయాలి, లేక ఆఫీసునైనా విడిచి పెట్టాలి, అంటూ నాయకులు ఒత్తిడి చేశారు. ఆఫీసును విడిచి పెట్టుటకే వారు నిశ్చయించు కొన్నారు. ఆంధ్ర రాష్ట్ర కమిటీవారు ఆలోచనైనా చేశారు. వీరి విషయంలో అదీలేదు!

ఈ ఘటనలన్నీ కాంగ్రెసు నాయకులు సోషలిస్టులను దూరంగా తరిమి వేయుటకు చేసే ప్రయత్నాలని ఊహించవలసి వస్తోంది.

కాని, సుభాష్‌బోసు తన హరిపూర్ అధ్యక్షోపన్యాసంలో యీ విధంగా చెప్పాడు.

"కాంగ్రెసు నియమావళి యొక్క హద్దులలో ఉంటూ ఒక తీవ్రవాద కక్షి సోషలిస్టు కార్యక్రమంతో పనిచేయుట చాలా సాధ్యము."

జవహర్లాల్ పండితుడు కూడా అప్పుడు యీ క్రింది హెచ్చరిక చేశాడు.

"తీవ్రవాదులను తరిమివేయు ప్రయత్నం ఒకవేళ జయప్రదం అయితే, అప్పుడు వినాశకాలమే వచ్చిందని చెప్పాలి. ఎందువల్లనంటే, వారు మన ఉద్యమంలో ఒక ప్రధాన భాగమును చెందియున్నారు, వారు లేనిదే ఉద్యమం యొక్క తీవ్ర స్వభావం నశిస్తుంది. చిన్న చిన్న సంస్కరణల కొరకు ప్రాకులాడే స్వభావం దానికి వస్తుంది. ప్రజా సామాన్యం యొక్క మనస్సులలో గందరగోళం వ్యాపించి, కాంగ్రెసు బలహీన మవుతుంది."

## ఫజ్లుల్‌హక్ గండం

మొన్న బెంగాలు శాసనసభలో విశ్వాస రాహిత్య తీర్మానం అనే గండం గడిచింది హక్కు మంత్రివర్గానికి. కోయిలిషన్ గ్రూప్ 82; యూరపియన్లు 23; ఆంగ్లో యిండియన్లు 2; షెడ్యూల్డు కాస్టు 9; నేషనలిస్టులు 4 రు మంత్రులు 10 మంది, మొత్తం 130 ఓటుచేశారు. పార్టీబలం 82 అయినా యూరపియన్లు 23 గురు ఉండేనేగాని, హక్కుకు దారిలేకపోయింది. కాంగ్రెసువారు 53 మాత్రమే అయినా, రెట్టింపుపైగా 111 ఓట్లు తెచ్చుకో గలిగారు. యూరపియన్ గ్రూపు వీరిని కాపాడింది. భారతదేశాన్ని కొల్లగొట్టుకు తిందామనే ఆశించే వీరు హక్కుకు కాక ఇంకెవరికి సాయపడతారు? ఇందుకేగా వీరికి ప్రత్యేక స్థానాలూ రక్షణలు మొదలగు ప్రత్యేకమగు వాయనాలన్నీ మన శాసనసభలలో ఏర్పాటు చేయబడ్డాయి.



ఇప్పుడింక బెంగాలులో కాంగ్రెసువాదులు తమకు అధికారంవస్తే యీ దిగువ కార్యక్రమాన్ని అమలు జరుపుతామని ప్రకటించారు. (1) భూమిశిస్తులు, పన్నులు మొదలగువాటిలో పూర్తి మార్పు. (2) శిస్తులను ఖరారుచేయుట. (3) భూముల మీద ఆదాయాన్నిబట్టి వృద్ధి క్రమానుసారంగా పన్ను విధించుట. (4) రాజకీయ ఖైదీలను అందరనూ విడుదలచేయుట. (5) జాతీయ ఉద్యమంలో పోగొట్టుకొనబడిన ఆస్తులు, భూములు వగైరాలను వాపసుచేయుట (6) కార్మికులకు 8 గంటలపని, జీవనానికి చాలిన కూలి, ఏర్పాటుచేయుట. (7) నిరుద్యోగపు భృతి ఏర్పాటుచేయుట. (8) నిరంకుశ శాసనాలను రద్దుచేయుట. (9) రైతుల వద్ద నుండి శిస్తు బకాయిలను వసూలు చేయుటకు కోర్టుద్వారానే తప్ప, రైతులను భూములనుండి వెళ్ళగొట్టుట మొదలగు వాటిద్వారా సాగించరాదు. మొదలగు 22 హంశా లందులో వున్నాయి. ఇందులో ఒక్కదాన్నీ కూడా హక్కు మంత్రివర్గం చేయలేదు.

దీనిని ప్రచారం చేయుటకును, ఇంతవరకు మందగమనంతో సాగే ముస్లింమాస్ కాంటాక్టు కార్యక్రమాన్ని తీవ్రంగా సాగించుటకు తీర్మానించుకొన్నారు. ఇది వెనుక ఎప్పుడో జరుగవలసినపని. దీనిని జయప్రదంగా బెంగాలు కాంగ్రెసువాదులు నెరవేర్చగలరని ఆశిస్తున్నాం.

## సర్. కె. వి. రెడ్డిగారు.

వీరు మద్రాసు ఉపన్యాసంలో కాంగ్రెసు సంస్థలో, శిక్షణ, నిబంధనలు మొదలగునవి ప్రజా తంత్రముగానే లేవన్నారు. రెడ్డిగారి కింత వరకు పర పరిపాలకులకు సేవజేయుటయే తప్ప స్వరాజ్యంకోసం పోట్లాడుటంటే ఏమిటో ఏమి అనుభవం వుంది?

## క్రిమినల్‌లా అమెండుమెంటు ఆక్టు.

### మద్రాసు మంత్రివర్గం.

క్రిమినల్‌లా అమెండుమెంటు ఆక్టు భారత జాతీయోద్యమాన్ని అణచుటకు బ్రిటిషు ప్రభుత్వముచే ప్రయోగింపబడి 1935 లో శాశ్వతము చేయబడినది. పౌరసత్వపు హక్కులను విశాల మొనరించుటకు దీనిని రద్దుచేయాలి, అని టి. టి. క్రిష్ణమాచారిగారు మద్రాసు శాసన సభలో ప్రతిపాదింపనున్నారు. దీనికి కాంగ్రెసు ప్రభుత్వంవారు వ్యతిరేకిస్తారని జాతీయ పత్రికలు కూడా వార్తలు ప్రకటించుచున్నవి.

ఈ తీర్మానం ఎవరు తెస్తే ఏమి? నిరంకుశ శాసనం ఒకటి పోయినా పోవడమేనని గమనించి, యీ చట్టంవల్ల కాంగ్రెసు వాదులమగు మనం పడ్డ బాధలు గుర్తు తెచ్చుకొని, "నిరంకుశ శాసనాలు రద్దు చేస్తాము" అని మన ఎన్నికల ప్రణాళికలోని వాగ్దానాన్ని సంస్మరించుకొని, యీ క్రిమినల్ లా అమెండుమెంటు ఆక్టును రద్దుచేయుటకు పూనుకోవలసినదని మద్రాసు శాసనసభా కాంగ్రెసు పార్టీ వారిని హెచ్చరిస్తున్నాము.

మద్రాసు రాజధానిలో హిందీ వ్యతిరేక ప్రచారకులపై యితర శాసనాలుండగా, యీ క్రిమినల్ లా అమెండుమెంటు ఆక్టును ప్రయోగించుటచే, మన కాంగ్రెసును, జాతీయ విద్రోహులు, జస్టిసు పక్షమువారు, (కె. వి. రెడ్డి వంటి వారు) మనలను విమర్శించుచున్నారు. వెనుక యీ చట్టమును మన పై ప్రయోగించి మనలను హింసించిన వీరికి అవకాశము మద్రాసు మంత్రివర్గము ఇచ్చియుండ కూడదు.

## యుద్ధంలో పాల్గొనం.

ఫ్రాంటియర్ రాజకీయ మహాసభలో "సరిహద్దులలో బ్రిటిషువారు చేసే అన్యాయాలను ఖండిస్తూ" తీర్మానం చేయబడింది. ఫ్రాం. దండయాత్ర కూడా బ్రిటిషు ప్రభుత్వపు యుద్ధ సన్నాహాలలో ఒకటి. ఎప్పటికైనా యీ ఫ్రాంటియర్ జనం పక్కలో బల్లెమేనని తెలుసుకొని, వారిని బానిసలుగా చేసుకొనుటకు ఫ్రాంటియర్ దండయాత్ర సాగుచున్నది. ఇదిగాక, మరి కొంతరాజ్యము కూడ బ్రిటిషువారికి సంక్రమించును. రష్యా దేశముపైదండెత్తుటకు దక్షిణమున మంచి మిలిటరీ బేస్, కూడా దొరుకును. ఇదీ! ఫ్రాంటియర్ దురంతములందలి రహస్యం, ఇది బ్రిటిషు ప్రభుత్వపు యుద్ధ ప్రయత్నం కాక మరేమౌతుంది?

వీటిని మనం అరికట్టాలి, దీని విషయమై ఫ్రాంటియర్ రాజకీయ మహాసభ నిర్ణయం ప్రశంశాపాత్రము.

## ఢిల్లీ ఎసెంబ్లీలో కాంగ్రెసు విజయం

బ్రిటిషు యుద్ధమంత్రి ఇండియాలోని బ్రిటిషు సైనికుల ఖర్చుకు అదనంగా సంవత్సరమునకు 2 కోట్ల రూపాయల వంతున ఈయాలని తీర్మానించడం. దానికి ఇండియా ప్రభుత్వం లొంగి సరే అని అంగీకరించడం జరిగింది. దీనిపై ఢిల్లీ కేంద్ర శాసన సభలో సత్యమూర్తిగారు ప్రభుత్వ చర్యను విమర్శిస్తూ తీర్మానం ఉపపాదించారు. ఇందువల్ల దేశంలో ఒక పెద్ద పోరాటం కూడా సంభవించగలదని ప్రభుత్వానికి ఆయన హెచ్చరిక చేశారు. "మాకు బ్రిటిషు సిపాయీలు అక్కరలేదం"టూ ముస్లింలీగ్ తరపున జిన్నాయు, అతని అనుచరులును కాంగ్రెసు పార్టీతో సహకారంచేశారు. యూరపియన్ సభ్యులు సహితము ప్రభుత్వ పక్షాన్ని ఓటు చేయకుండా తటస్థంగా ఉన్నారు. ఎన్నిక సభ్యులలో ఒక్కరుకూడా ప్రభుత్వ పక్షానికి పోలేదు. 71—33 వోట్లతో సత్యమూర్తిగారి ప్రతిపాదన గెలిచింది.

ఇంతవరకు సంతోషించవలసిన విషయమే. కాని, చట్టప్రకారం వైస్రాయి ఈ తీర్మానాన్ని త్రోసి రాజనవచ్చు. బ్రిటిషు ప్రభుత్వం వేరు. ఇండియా ప్రభుత్వం వేరు అనేస్పృష్టి అతనికి ఉండదు.

సరిహద్దు ప్రాంతంలో బ్రిటిషు సైన్యముల బాంబు ప్రయోగాన్ని ఖండించుటకు సత్యమూర్తిగారు ప్రతిపాదించిన తీర్మానం చర్చించబడరాదంటూ ఎసెంబ్లీ అధ్యక్షుడు రూలింగు యిచ్చాడు.

బ్రిటిషు విమాన శాఖామంత్రి యీ మధ్య కొచ్చిన్ వచ్చుటకు కారణమేమని సత్యమూర్తిగారు ప్రశ్నిస్తే, జవాబులేదు.

యుద్ధ ప్రతికూల ప్రచారంచేస్తే 2 ఏండ్లు కఠినశిక్ష విధించుటకు ప్రభుత్వం ఒకబిల్లు ప్రతిపాదించ బోతూన్నది.

ఇవన్నీ చూస్తే, యుద్ధంలో భారతీయులను కూడా ఆహుతిచేయుటకు బ్రిటన్ సన్నాహం చేస్తుందని స్పష్టపడగలదు.

## నేటి ప్రపంచం

(11 వ పేజీ తరువాయి)

లలో ఒకటి. ఎబ్రోనది దక్షిణాన గండెసా పర్వత ప్రాంతాల విద్రోహులు స్వీయ రక్షణకై తీవ్ర ప్రయత్నం గావించుతున్నారు. 18 విద్రోహుల విమానాల కూల్చామని రిపబ్లికూ, 13 ప్రభుత్వ విమానాలు కూల్చామని విద్రోహులూ ప్రకటించారు.

ఫ్రాంకో విమానాలు, బాంబులు పని చేయడం మానలేదు. అలికాంటి నగరములో 80 బాంబుల వేశారు. మిలటరీ హాస్పిటల్‌పై బడినయి. కాని ప్రభుత్వ రక్షణల కట్టుదిట్టం వల్ల కాబోలు ఒకడే మరణించాడు.

'లాకీ ఉగానో' అనే బ్రిటిష్ స్టీమరుపై బాంబులు వేసినందుకు బ్రిటన్ ఇంకోసారి మరొక తీవ్ర అసమ్మతిని చూపింది.

ఫ్రెంచివారు నాన్ ఇంటర్వెన్షన్ కమిటీ సలహాల నమలులో పెట్టడానికి, పైరినీస్ సరిహద్దును మూసినా, ఇంకా ఇటలీ ఆయుధ విమానాల సప్లయి ఫ్రాంకోకు గావించుచున్నదని, కౌంటు సియానో (ఇటలీ విదేశాంగ మంత్రి)తో, నోయల్ ఛార్లెస్ (ఫ్రాంసు) తెల్పాడు.

బాంబుల నుండి పౌరులను రక్షించు విధానం ఎలాగా అని వచ్చే జాతి సమితిలో చర్చిస్తారట!

వలంటీర్ల సమస్య విషయమై జవాబు చెప్పలేదు ఫ్రాంకో. మరో ప్రక్క బ్రిటిష్ నావలను ముంచుతున్నాడు. ఇంకో ప్రక్క ఇటలీ వార్తలే సగర్వంగా "ఇటలీవారు 158 సార్లు విమానదాడిని సల్పారు, ఎబ్రో నదీ తీరంలో జరిగిన యుద్ధంలో" అంటూ చెపుతున్నాయి. అయినా బ్రిటన్ ఏమంటున్నది? మోకాళ్ళపై నిలబడి "ఫ్రాంకోగారూ, జవాబు చెప్పండి" అని ప్రార్థిస్తున్నది.

చివరికి ఎలాగయితేనేం ఫ్రాంకోనుండి జవాబు వచ్చింది. ఏమని? జవాబు చెప్పక పోవడంలో దురుద్దేశ్యం లేదనీ, త్వరలో జవాబు ఇస్తామని. దీనికే సంతృప్తి పడుతుంది బ్రిటను.

ఎటు జూచినా బ్రిటిషువారికి చుక్కెదురౌతున్నది. జెకోస్లొవేకియాలో రన్సిమన్ రాయబారాలు—కుట్రలు ఫలించేటట్లు లేవు. వలంటీర్ల విత్‌డ్రాయల్‌తో స్పైన్‌ను రూపు మాపి, మధ్యధరా సముద్ర సమస్యను పరిష్కరించుకోవాలన్న భ్రమ పూర్తి అయేటట్లు లేదు. పాపం! బ్రిటిష్ పన్నాగాలు ఎచటా ఫలించడం లేదు.

## సరిహద్దులో "అహింస"

సరిహద్దు రాష్ట్రంలో ఘల్లాధర్ అనే గ్రామంలో రైతులు సత్యాగ్రహం చేస్తుంటే, సోషలిస్టులు వారికి సహాయం చేస్తున్నారు. ఎర్రచొక్కాల వాలంటీర్లు కూడా సహాయం చేయుటకు సిద్ధంగా ఉన్నారు. మర్దాన్ జిల్లా కాంగ్రెసు కమిటీవారు దీన్ని గురించి ఒక తీర్మానం చేశారు. "జమీందార్లకూ, రైతులకూ మధ్య ఘర్షణవస్తే, అది రక్తపాతమునకు, అహింసా సిద్ధాంతం భగ్నం కావడానికి దారి తీస్తుంది. కాబట్టి" అవిధంగా సోషలిస్టులు చేయవద్దని హెచ్చరిస్తూ తీర్మానించారు. ఇంతేకాదు, సరిహద్దు రాష్ట్రమందలి సోషలిస్టులను కాంగ్రెసు నుండి తొలగించ వలసినదని రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి సిఫార్సు కూడా చేశారు.

★ ★ ★

శాసనోల్లంఘ నోద్యమంలో బ్రిటిషు ప్రభుత్వానికీ భారతీయులకూ ఘర్షణ వచ్చినప్పుడు "అహింసా" సిద్ధాంతానికి భంగం రానప్పుడు, జమీందార్లకూ రైతులకు మధ్య ఘర్షణ మాత్రం ఏ విధంగా దానికి దారితీస్తుందో అర్థంకాదు.

## పాలస్టయిన్‌లో చిత్రవధలు.

అయినా, బ్రిటన్ యుద్ధ సన్నాహాలు మానలేదు. బ్రిటిషు సైనికుల రిక్రూట్‌మెంటు హెచ్చింది అటు పాలస్టయిన్‌లో 'బందిపోటు దొంగలను' పేరు పెట్టి బ్రిటిష్ సైనికులు అరబ్బు స్వాతంత్ర యోధులను చిత్రవధ గావించుతూనే ఉన్నారు. పాలస్టయిన్‌లో స్వాతంత్ర్యాగ్ని చల్లారనే లేదు.

హైఫాలో బాంబు వేయడం వలన 9గురు మరణించారు. మరి రెండు బాంబులు అరబ్బుల మార్కెటువద్ద పడినాయి.

ప్రతిచోటా 'బందిపోటు'లనబడే అరబ్బు స్వాతంత్ర్య యోధులకూ సైనికులకూ ఘర్షణ కల్గుతూనే ఉన్నది.

పాలస్టయిన్‌లో అరబ్బుల స్వాతంత్ర్యము నణచుటతోనే బ్రిటిష్‌వారికి తృప్తి లేదు. దానిని "మిలటరీ బేస్"గా కావించాలని బ్రిటన్ యత్నం. అందుకే మాల్కాం మాగ్డనాల్డు హఠాత్తుగా పాలస్టయిన్‌ను సందర్శించాడు. అందుకోసరమే పాలస్టయిన్ స్వాతంత్ర్య సమరాన్ని ఇలా క్రూరంగా అణచు తున్నారు.

ఈ నిర్బంధ విధానాన్ని మనదేశంలో అనేక మహమ్మదీయ సంఘాలు, ఖండించాయి.

బ్రిటన్ ఈ విధంగా, యుద్ధ సన్నాహాలు తమ దేశంలోనే గాక, ఈజిప్టు, పాలస్టయిన్‌లాంటి వలసదేశాలలో కూడ గావించుతున్నది. యుద్ధపు ఖర్చులను వలసదేశాల ప్రజలపై రుద్దడానికి తయారయింది. బ్రిటిష్ సామ్రాజ్యపు దురంతాలను, యుద్ధానికి సన్నద్ధమయ్యే ఈ చర్యలను, యూరప్‌లో ఫాసిస్టులకు లొంగుబాటు తనం చూపే పిరికితనపు రాజనీతిని ప్రపంచమంతా గర్హించాలి! మనము తీవ్రంగా నిరశించాలి!!

# యజమానుల నిరంకుశత్వమే కార్మికుల అధోగతికి కారణం

## బెజవాడ.

"రంగా" గారి కార్మిక బిల్లు.

అనేక పట్టణాలలో బహిరంగసభలు జరిగినయి. బెజవాడలో రైల్వే పనివారల యూనియన్, ప్రెస్ వర్కర్సు యూనియన్‌ను కలని గొప్ప ఘూరేగింపు జరిపి, బహిరంగ సభ జరిపారు. బెజవాడ, ఏలూరు, బందరులోను మీటింగులు ఏర్పాటుచేసి రంగాగారి బిల్లును బలపరచుచూ తీర్మానాలు జేశారు. మద్రాసు రాష్ట్రి ప్రభుత్వము కూడా వెంటనే కార్మిక శాసనాలు జేయాలని తీర్మానించారు.

12-8-38 వ తేదీన బెజవాడలో యం. యస్. యం. రైల్వే పనివారల బహిరంగ సభ జరిగింది. వి. వి. నరసింహంగారు M. L. A. అధ్యక్షత వహించారు. ఏ. యస్. రాజుగారు కాగిన్సు దొరగారి జీవితాన్ని గురించి మాట్లాడి, వారి అకాల మరణమునకు సానుభూతి వెలిబుచ్చారు. సుబ్రమణ్యం గారు ఎసంబ్లీలో "రంగా"గారు ఉపాదించుచున్న బిల్లును గురించి తీవ్రమైన ఆందోళన చేయవలసినదిగా కార్మికులను హెచ్చరించారు.

ట్రావిలింగు హమాలీల కష్టాలు ఎక్కువయినయి. జీతం కొద్ది, క్వార్టర్సు లేవు, ట్రావిలింగు ఎలవెన్సు లేదు. బయట వూళ్ళు వచ్చినపుడు పడుకునేందుకు సదుపాయాలు లేవు. భార్యా, పిల్లలను వదలిపెట్టి, రాత్రింబగళ్ళు, గూడ్సు ట్రెయినులలో ప్రయాణం జేయుచు కాలం గడపాలి. ఈ కష్టాలు పై అధికారులకు తెలియబర్చుచుంటే లెక్క చేయుటలేదు. యితర రైల్వేలలో యిచ్చు కొద్ది సౌకర్యాలు కూడా వీరికి యిచ్చుటలేదు. రైల్వే అధికారులు వెంటనే వారి కష్టాలు విచారించి, నివారణ చేయాలి.

పైనుండి రాయి మీద పడుటచే కొండలు పగులగొట్టే కూలీలు ఇద్దరు, సజీవంగా భూస్థాపనమై మరణించారు.

కూరగాయల బజారులోని దుకాణాలపై మ్యునిసిపాలిటీవారు పన్ను ఎక్కువ చేయుటచే గవర్నరుపేట కూరగాయల దుకాణాల వారందరు హర్తాలు చేశారు. పన్ను తగ్గించుటచే, తర్వాత దుకాణాలు తెరచిరి.

## విశాఖపట్టణం.

హార్బరు కార్మిక సంఘ కార్య నిర్వాహక వర్గం ది 3—8—38 తేదీని సమావేశమై అంతవరకు జరిన పనిని గూర్చి విమర్శించుకొని వివిధ తీర్మానాలు చేశారు. "ఇ" జార్జి శ్రేను పని చేయునపుడు బ్రేకులు వగైరాలు సర్దుకొనుట చాలా కష్టము గనుక, దానికై వేరే సిబ్బందీని హెచ్చించవలసినదని యజమానులను కోరినను వారు చేయనందుకు అసమ్మతిని తెలిపిరి.

లోగడ యీ క్రేనులో పై పని చేయుచుండగనే షరాబుద్దీన్ అను డ్రైవరు తల అంచులో పడి నలిగి పోవుటచే మరణించెను. ప్రభుత్వం యీవిషయమై తగుశ్రద్ధ తీసుకొని, 23—7—1938 వ తేదీని గాయపడి మరణించిన షరాబుద్దీన్ గారి కుటుంబమునకు కాంపెన్సేషన్ యిప్పించాలి.

## ఏలూరు.

మంజువాణీ ప్రెస్సులో ది 12—7—38 తేదీని ప్రారంభమైన సమ్మె యింకనూ జరుగుచునే ఉన్నది. సమ్మె ప్రారంభమై యిప్పటికి 35 రోజులయింది.

## చిట్టివలస.

సమ్మె ఆపగానే విచారణ కమిటీని వేస్తామని ప్రభుత్వం ప్రకటించింది. వెంటనే యిష్టం లేకపోయినా సమ్మె ఆపి కార్మికులు 8 వ తేదీని పనిలోకి వెళ్ళారు. 12 వ తేదీని ప్రభుత్వంవారు, యీ తగాదాను విచారించుటకు జావాద్ హుస్సేన్, (మద్రాస్ కలెక్టరు) గారిని నియమించారు.

## కోయంబత్తూరు

బట్టలమిల్లు తగాదాలను గూర్చి ప్రభుత్వ ప్రకటన.

కూలీలు సమ్మె చాలా రోజులు చేశారు, మిల్లు యజమానులు కొత్త కూలీలనుపెట్టి పని చేయ ప్రారంభించారు. అందుపై పికెటింగులు ప్రారంభమయాయి.

ఇంతకు పూర్వమే చీరాల కూలీలపై పోలీసులు తుపాకులు కాల్చారు. యీ అనుభవాన్ని గుర్తించి, కోయంబత్తూరులో మిల్లులు తెరువకూడదని యజమానులపై 144 వ శెక్షన్‌ను ప్రభుత్వం ప్రకటించింది. మధ్యవర్తిత్వ కోర్టును ఏర్పాటు చేసింది. ఆకోర్టు రిపోర్టు 1938 మే నెలలో ప్రకటితమైంది.

తదుపరి కార్మికుల జీతాలను నియమించుటలో వారికి యజమానులకు మధ్యనున్న పరిస్థితుల పరిశీలించుటకు లేబరు కమీషనరైన స్త్రాతీ గారిని ప్రభుత్వం జూలై 2వ తేదీని నియమించింది. ఆయనకూడా తన సలహాలను ఇచ్చారు. యిప్పుడు ప్రభుత్వ ప్రకటన వచ్చింది.

ప్రభుత్వపు ప్రకటనలో కనీసపు కూలి మాత్రమే నిర్ణయం చేయబడింది. నిజంగా కూలీల సమ్మెలకు ఇంకా అనేక కారణాలున్నాయి. (1) పని గ్యారంటీ లేకపోవుట. (2) గంటల నియామకం తప్పిపోవుట. ఉన్నవి అయినా అసలు జరుగకపోవుట (3) నివాస సౌకర్యాలు లేకపోవుట (4) కూలీ సంఘాన్ని యజమానులు గుర్తించకపోవుట (5) నెలవులు, రోగసమయంలో సదుపాయాలూ లేకపోవుట మొదలగు విషయాలు అనేకములున్నాయి. యీ కోయంబత్తూరు తగాదాకు కూడ ముఖ్యమగు కారణాలలో ఒకటి "పనినుండి కూలీలను తొలగించుట" దీనిని గురించి ప్రభుత్వం తన నిర్ణయాన్ని ఇవ్వలేదు.

కార్మికులకు కనీసపు కూలిని నిశ్చయించుటలో ప్రభుత్వం కార్మికులకు మేలుచేసింది. 11 రూపాయిలకు కూలి తగ్గదుఅనే విశ్వాసం కార్మికులకు కలుగుతుంది. అంతకు ఎక్కువ జీతం వచ్చేవాళ్ళకు తగ్గదు అనే ధైర్యం కూడా కలుగుతుంది.

యీ విధానం జూలై 1వ తేదీ నుండియు అమలులోనికి తీసుకొనిరావాలి. "ఏ పరిస్థితులలో వైనాసరే సెప్టెంబరు 1 వ తేదీ నాటికి సదరు సంబంధమగు బట్వాడా లన్నియు పూర్తి గావాలి" పైవిధంగా ప్రభుత్వం యజమానులకు సూచన మాత్రమే చేసింది. యిది శాసనంగా వచ్చి ఉండవలసినది 11 రూపాయిలను 15 రూపాయిలుగా మార్చిఉంటే కాన్పూరులో జరిగిన ఒడంబడికలో జీతాల విషయంలో సమంగా ఉండేవి. కూలీలకు కొంతవరకూ సరిపోయి ఉండేవి. ఈ 11 లు ఏమిచాలదు. స్త్రీలకు 7—8—0 మాత్రమే నిర్ణయింపబడింది. ఇది 11 రూపాయలయినా చేయవలసినది.

కాని, మద్రాసు ప్రభుత్వం మేజర్లు అయిన కూలీలకు మేజర్లుకాని శక్తివంతులగు (adolescent) కూలీలకు వ్యత్యాసం కల్పించింది. ఇది చూపకుండా ఉండవలసినది. విచారణ బోర్డువారు సూచించిన బోనసు పద్ధతిని స్త్రాతీ సూచనపై వదలివేయుట న్యాయంకాదు. రాత్రికాలంలో అదనముగా పనిచేసే వారికి రు 1-0-0 అదనంగా కూలి ఇవ్వాలి అన్నారు. శాసనం చేయడం ఒక ఎత్తు. దానిని అమలు జరిపించడం ఇంకొక ఎత్తు.

## కార్మిక సమస్యలు

నిజంగా వీటినైనా దురాశా పీడితులగు మిల్లు యజమానులు నెరవేర్చరు. వారిచే వీటిని అమలు జరిపించిన నాడే మన మంత్రి వర్గపు పని యీడేరుతుంది.

ఎన్ని నియమాలను చేసినప్పటికీ, ఎంత కాలమైతే కూలీకి పని గ్యారంటీ ప్రభుత్వం ఏర్పాటు చేయకుండా ఉంటుందో అంతవరకూ ఈ సూచనలన్నీ నిష్ప్రయోజనం. కార్మికులను పనిలోనుండి యజమాని, తొలగిస్తాడు. మళ్ళీ సమ్మెలు సిద్ధం—అందుచే సదరు హామీ కూలీలకు ప్రభుత్వం ఏర్పాటు చేసి యుండవలసింది. ఇప్పుడైనా మించిపోయినది లేదు. యీ ప్రకటనకు అనుబంధముగా ఒక దానిని ప్రకటించి ఇందులో కొరతగా ఉన్నవాటిని, హెచ్చించ వలసిన వాటిని పూర్తి చేసినచో బాగుంటుంది. కాంగ్రెసు మంత్రులపై కార్మికుల విశ్వాసం మిన్నంటుతుంది.

కార్మికులకు నిరుద్యోగ భృతి, గ్రాట్యూయిటీ, వృద్ధాప్య పింఛను, నివాస సౌకర్యాలు, సంఘాలను యజమానులచే గుర్తింపజేయుట, విద్యా సౌకర్యాలను ఏర్పాటు చేసేటంతవరకు మనం ఎన్నికల ప్రణాళికలో కార్మికులకు చేసిన వాగ్దానాలను నెరవేర్చుకొనలేము. అందుచే అట్టి సౌకర్యాలను కార్మికులకు సమకూర్చే కార్మిక శాసనాలను ఏర్పాటు చేయుటకు కాంగ్రెసు మంత్రివర్గం పూనుకోవాలి.

కోయంబత్తూరులో యిన్నాళ్ళనుండి తీవ్రముగా ఆందోళన చేస్తే ప్రభుత్వ అధికారులు, పెట్టుబడిదారులు మొదలగువారిని సరకుచేయక యీ మాత్రమైనా మన మంత్రులు చేయగలిగారు. యీ విషయాన్ని గుర్తించి మన మంత్రులు ఎన్నికల ప్రణాళికలో చెప్పినవన్నీ నిరాఘాటంగా అమలు జరుపుటకు వలయు శక్తిని మనం ఆందోళన ద్వారా, సంఘటన ద్వారా నిశ్చల పోరాటం ద్వారా, మన మంత్రులకు సమకూర్చాలి.

## యు. పి.

కాన్పూరులో 8 మంది కూలీలను పనిలో నుండి యజమానులు తొలగించినందున ఆవిషయమై లేబరు కమీషనరు విచారించుచుండగా, ఆ జె. కె. మిల్లులనుండి మరి 9 మందిని 4 వ తేదీన శిక్షణ తప్పినరని నెపంతో డిస్మిస్ చేశారు. 15 రోజులలో పనిలోనుండి తీసివేస్తా సుమారు 123 మంది కూలీలకు వేర్వేరు మిల్లుల యజమానులు నోటీసిచ్చారు. దీని విషయమై శ్రద్ధ తీసుకోవాలని కార్మికులు నాయకులను కోరి కార్మిక సంఘాలను యజమానులు గుర్తించాలని రాజారాం శాస్త్రిగారు శాసన సభలో తీర్మానం తెచ్చారు. మంత్రి కట్జూగారు 4 నెలలలో అట్టి శాసనం తానే తెస్తానని వాగ్దానం చేశారు. సగం చర్చలో సభ ముగిసింది.

దీని విషయంలో తీవ్రమగు పోరాటం సాగించి యజమానుల మోసాన్ని అరికట్టాలనియు దానికి సిద్ధంగా నుండవలసినదనియు మజ్దూరు సభ కార్యదర్శి హెచ్చరించాడు.

కార్మిక స్త్రీలకు ప్రసవకాలంలో సదుపాయాలు ఏర్పాటు చేయాలని యు. పి. శాసనసభ చేసిన శాసనాన్ని గవర్నరు జనరల్ ఆమోదించెను.

అలహాబాదులో గవర్నమెంటు అచ్చు పనివారికి అగస్టు 1 నుండి అరగంట తగ్గించబడును, 3 సంవత్సరముల సర్వీసు ఉన్నవారికి ప్రావిడెంటు ఫండు యిస్తామనియు ప్రభుత్వం ప్రకటించింది.

## నేత్రకోన

నేత్రకోన (మైమన్సింగ్) లో జనపనార తోలు కూలీలకు 6 పైసలు రేటు యిదివరలో యిచ్చేది. యిప్పుడు 7 పైసలు రేటు యిచ్చుటకు యజమానులు అంగీకరించారు. వారి ఇతర కష్టాలను గూడ నివారిస్తామని చెప్పుటచే సమ్మె 5 వ తేదీ సాయంత్రం ముగిసింది.

## మధుర

మహాలక్ష్మీ మిల్లులో పనిచేసే కూలీలు తమ సంఘాన్ని యజమానులు గుర్తించాలనియు, మధుర మిల్లులలోనున్న రేటుకు కూలీ హెచ్చించాలనియు, పనిలోనుండి డిస్మిస్‌గాని. సస్పెండుగాని చేయబడిన వారి నందరిని పనిలో చేర్చుకోవాలనియు, స్త్రీ కార్మికులకు సదుపాయాలు ఏర్పరచవలసిన దనియు కోరుతూ 3 రోజులలో సమాధానం ఇవ్వవలసినదనియు లేనిచో ముందు కార్యక్రమం ఓటుద్వారా నిర్ణయించుకు తగుచర్య అవలంబిస్తామనియు యజమానులకు కార్మికులు నోటీసిచ్చారు.



# హుష్! కమ్యూనిస్టులున్నారు!! జాగ్రత!!!

## ప్రజలకు మద్రాసు ప్రభుత్వ హెచ్చరిక

### కమ్యూనిస్టులపై, మద్రాసు, యు. పి. రాష్ట్రాల వైఖరి.

## మద్రాసు ప్రచురణశాఖ మంత్రి ప్రకటన.

భారతదేశ కమ్యూనిస్టు పార్టీ సభ్యులలో విరివిగా పంచిపెట్ట బడుచున్న కొన్ని కరపత్రాల ప్రతులు కొన్ని మా స్వాధీనమందు ఉన్నవి. ఈపార్టీ సభ్యులు దేశములో తాము గొనిరానున్న అరాజకమును గూర్చియు, వీరు చేయదలచు కొనిన దుష్కార్యాలను గురించియు యీ కరపత్రాలు మాకు తెలియజేయుచున్నవి. అందుచే అమాయకత్వంవల్ల ప్రజలు మోసపోయి భారతీయ సాంప్రదాయానికీ, విజ్ఞానానికీ పూర్తిగా విరుద్ధమైన సిద్ధాంతాలు, కార్యక్రమమూ కలిగిన యీ కమ్యూనిస్టు ఉద్యమంలో చిక్కుకొని పోకుండా ఉండుటకు తగు జాగ్రత్తలో ఉండేలాగున చేయవలసిన బాధ్యత మాపై నుండుటచే మేము అందలి హంశాలను కొన్ని వెల్లడించుచున్నాము.

"భారతదేశ బూర్జువా వర్గము యొక్క ప్రధాన సమస్యల"ను గూర్చిన ఒక కరపత్రములో "భారత దేశములో శాసన సమ్మతమైన కార్య విధానంతోనే బ్రిటిషు సామ్రాజ్య బూర్జువా వర్గముతో, కాంగ్రెసు పోరాటమును సాగించుచున్నదనియు, ప్రజలను రాజకీయముగా అజ్ఞానము (Ignorance) నందే నిలుపుచున్నదనియు ప్రారంభించి "భారతీయ బూర్జువా వర్గముచే ఏర్పాటు చేయబడే ప్రజా ప్రతినిధి పరిషత్తుచేత సమావేశము సంపూర్ణ స్వాతంత్ర్యం కాదనియూ, విదేశీయ, స్వదేశీయ పెట్టుబడిదారీ వర్గాలు సమిష్టిగా భారతీయ ప్రజా సామాన్యాన్ని దోచుకొనుటకు ఇరుపక్షాలువారూ గావించుకొనే గొప్పరాజీ అనియు" ఉన్నది.

ఇంకా దానిలో ఇలా ఉంది.

"జాతీయ పోరాటము రెండు విధాలుగా పోతోంది. ఒకటి శాసనసభా కార్యక్రమం. ఇది శాసనసమ్మత పంథానే, అవలంబించే సంస్కరణ వాదపు పద్ధతి. రెండవది ప్రజా పోరాట యుతమగు నిశ్చల విప్లవ జాతీయ పోరాటం."

జాతీయ విప్లవ సమ్మె.

"భారతదేశ శ్రామికవర్గం యొక్క విప్లవ నాయకమణి యగు భారతదేశ కమ్యూనిస్టు పార్టీ, వర్గ కలహాన్ని, జాతీయ విప్లవ సమ్మెగా అభివృద్ధి చేసి, దానిని సాగించును. ఆ సమ్మె స్వరూపం ఇది"

"కార్మికులు అందరూ పనిముట్లు విసర్జించి, పని మానేస్తారు. విద్యావంతులు బళ్లలూ, కాగితాలు వదలివేస్తారు—విద్యార్థులు, స్కూళ్ళు మానేసి వీధుల్లో ఊరేగింపులు చేస్తారు. రైతులు పన్నులు నిరాకరిస్తారు. రైళ్ళు ఆగిపోతాయి. ఫ్యాక్టరీలు మిల్లులు, పవరు స్టేషన్లు అన్నీ ఎక్కడివక్కడ బంద్ అవుతాయి. మిలిటరీ, సాయుధసేనలు ఏటూచేయలేక ఊగిసలాడతాయి. సైన్యాలల్లో ఉండే చాలామందిని వారి విప్లవ కమిటీల ద్వారా జాతీయ పోరాటానికి సహాయ పడేలాగున మన వైపుకు మార్చివేసుకుంటాము. వీరందరూ కలసి, తమను చంపుటకు తయారయే ఇతర సైనికులను తమ పక్షానికి త్రిప్పుకొని, వారి సేనాపతులను నిరాయుధులను గావించి, విప్లవ వాదులగు ప్రజా రక్షక దళాలతో కలసిపోయి ప్రజా సైన్యాలుగా మారిపోతారు"

"జాతీయ సమ్మె జాతీయ విప్లవముగా అభివృద్ధి చెందుతుంది. ఇంతవరకూ శాంతియుతముగా వుండే విప్లవ ప్రజా సైన్యాలు సామ్రాజ్య మిలిటరిస్టులకు ఎదురు తిరగాలి—వీరైనంతవరకు ప్రజలకు ఆయుధాలను సప్లయి చేయుటకు దళాలుగా తయారయి, ఎక్కడి కక్కడ పోలీసు స్టేషన్లను, ప్రభుత్వమందు కొతారులను, వశపర్చుకొని, ప్రజల నందరను సాయుధులుగా చేసి విప్లవ సైన్యాల సంఖ్య బలమును వృద్ధి చేయాలి—తదుపరి యీ సైన్యాలు జాతీయ సంఘటన యొక్క స్థానిక కమిటీల నాయకత్వం క్రింద పనిచేస్తూ ఉండే తమ తమ స్థానిక సంఘాల క్రింద పని చేస్తూ, స్వాతంత్ర్య విప్లవ యుద్ధాన్ని సాగించాలి"

"యీ జాతీయ సంఘటనలో నున్న ద్వివిధ శక్తులున్ను అధికారం కోసం పెనగులాడుతూ వుంటాయి. పతనం సంభవించిన తరువాత, సామ్రాజ్యవాదులు జాతీయ విద్రోహులను, సంస్థానాధీశ్వరులనూ ఆధారంగా తీసుకొని, జాతీయ విప్లవాన్ని భగ్నం చేయాలని ప్రయత్నం చేసేటప్పుడు యీ పెనగులాట మరీ సంకులమై పోతుంది. యీ విధంగా అంతరంగిక స్పర్ధలు వృద్ధి పొందుతాయి—వర్గ కలహం తీవ్రమవుతుంది; భయంకరమగు అంతర్యుద్ధం ప్రారంభ మగుతుంది"

"కట్టకడపటి సంయుక్త సోషలిస్టు సోవియట్, రిపబ్లిక్‌తో దగ్గిర సంబంధ మేర్పరచుకొనేటట్టి సోవియట్ పరిపాలన ఏర్పాటుచేస్తారు"

ఇది ఆకరపత్రములోని విషయం

ఈరకపు పరిస్థితులలో అహింసను సాధించుటకును ప్రయోగించుటకునూ తావిసుమంతైనా లేదు అనేది వేరే చెప్పనక్కరలేదు. "మేము అహింసా సిద్ధాంతాన్ని ఎందుకు ఎదిరిస్తున్నాము" అనే శీర్షిక వచ్చిన వ్యాసంలో కొన్నిటిని కూడా చూపుతున్నాము.

"జాతీయ ఐక్య సంఘటనా కార్యక్రమాన్ని అమలు జరుపుటకు, అసహాయోద్యమము (Civil Dis-obedience)ను గూర్చి పునరాలోచించాలి. సంపూర్ణ స్వరాజ్య పోరాటములో గాంధీగారు సూచించే శాంతి, అహింసా పద్ధతులను ఏమాత్రమును కమ్యూనిస్టులు అంగీకరించరాదు"

"గాంధీ అసహాయ ఉద్యమమే కావాలంటాడు. హింసకు ప్రతికూలుడు. అహింస పవిత్రమంటాడు. అహింస పేరుతో ఆయన ప్రజలలో భక్తిమనే మత్తును వ్యాప్తి చేస్తున్నాడు. ఈవిధంగా ముందుకు సాగిపోయే ప్రజా ఉద్యమపు గమనాన్ని అరికట్టుచున్నాడు"

కార్మికుల ఆయుధం.

"1928 నుండియు కార్మికులు తమ పోరాటంలో గాంధీ పద్ధతిఅంటే అసహ్యించుకొనుచున్నారు, పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా సాగించే పోరాటంలో కార్మికుల బలమైన ఆయుధం సమ్మెయేగాని హర్తాలుగాదు"

"విరోధులను ఓడించడం సంగతి అల్లా వదలివేసి, పోనీ, సంస్కరణలకైనా యీ అహింస ఏమైనా ఉపయోగపడుతుందా? కమ్యూనిస్టులు వ్యక్తిగత హింసావాదమును అంగీకరించరు. ప్రజలకు వారి విరోధులకు మధ్య జరిగే పోరాటాన్నే హింసాయుత పద్ధతి అని కమ్యూనిస్టులు అంటారు"

"హింసను ఎదుర్కోవా లంటే హింసయే శరణ్యము, ప్రభుత్వాన్ని హింస ద్వారానే నాశనం చేయాలని ప్రజలకు తెలియజేయాలి"

ఇందుపై ప్రభుత్వపు హెచ్చరిక.

ఇటువంటి ప్రచారానికి ముగ్ధులైనచో ప్రజలు యిందుకు ఫలితమైన హింసా అరాజకాలకు వారు దారి తీసి, భారతీయుల ఆధ్యాత్మిక. భౌతిక అభివృద్ధికిని, నిజమగు స్వేచ్ఛకును తీరని నష్టాన్ని కల్పిస్తుం దనియూ ప్రభుత్వం నమ్ముతోంది.

ఇట్టి కార్యక్రమం జయించడం అసాధ్యం. ఇది నిస్సంశయం. ఇట్టి ప్రచారంలో వాదంలో పదే పదే ప్రయోగింపబడే పదజాలము అర్థము లేనిది. ఇట్టి ప్రచారం వల్ల రహస్య సంఘాలకు బలము నిచ్చినచో సాంఘిక పారిశ్రామికాభివృద్ధి కొరకును, సంపూర్ణ రాజకీయ స్వాతంత్ర్యమునకును, కృషి చేసే, ప్రభుత్వపు అహింసా శక్తుల బలాన్ని నాశనం చేసినవారగుదురు.

దీనిపై ఇండియన్ ఎక్స్‌ప్రెస్ ఇల్లా వ్రాసింది.

మద్రాసు ప్రభుత్వ ప్రచురణ శాఖవారు కమ్యూనిస్టుపార్టీ పనులు అని ఇచ్చిన ప్రకటన ఆఖరిని "ఈ పార్టీయొక్క కార్యక్రమం జయప్రదం అవడానికి, ఏమాత్రము సాధ్యముగాదనియు దానినిగూర్చి ఎవరూ ఏమీ భ్రమింపవలదని"యు చెప్పారు. బాగుంది. అయితే యింత దుస్సాధ్యమైన కార్యక్రమం విషయమై యీ ప్రచురణ శాఖామంత్రి యింత శ్రమ ఎందుకు పడవలసి వచ్చిందో ఊహకు అందడం లేదు" కమ్యూనిస్టులచే పదేపదే వాడబడే పదజాలం, వాదనలు, సాంఘిక పారిశ్రామిక అభివృద్ధి కోసం పాటుబడే అహింసా ఉద్యమాన్ని బలహీన పరుస్తుంది అన్నారు యీ ప్రకటనలో. "అయితే ఇదివరకే వారు ఎక్కువ మార్లు చెప్పిన దానిని ఇంకొకమారు చెప్పి యీశాఖ వారు దానిని ప్రజాదృష్టికి ఎక్కువగా తీసుకు వచ్చుటలో తమ వివేచనాశక్తిని ప్రదర్శించారు. ప్రభుత్వ పాలసీ, అభిప్రాయాలు మొదలగు అనేక అత్యవసర ముఖ్యసమస్యలపై ప్రజలకు బోధగట్టా కావలసివుంది. కమ్యూనిస్టులను పొడవడం ఇతరులకు విడిచివేసి ఇన్ఫర్మేషన్ శాఖ యీ పనులను చూస్తే బాగుంటుంది.

## కమ్యూనిస్టు ఆందోళనపై యు. పి. ప్రభుత్వపు అభిప్రాయం.

"కాన్పూరు కార్మికులలో కమ్యూనిస్టు ప్రచారం దారుణంగా జరుగుతోంది. కమ్యూనిస్టు చిహ్నాలతో ఎర్రజండా గత 6 నెలలలోనూ వ్యాపించి కార్మికుల మీటింగులలోనూ ఊరేగింపులలోనూ, జాతీయ పతాకపు స్థానాన్ని తాను పొందింది. కమ్యూనిస్టు భావాలు వర్గ ద్వేషం ఇల్లా మిల్లుగేట్లవద్దను, పట్టణ మంతటను చెలరేగి వ్యాపిస్తూ ప్రచారం అవుతూ ఉంటే, మాకూ కార్మికులకు శాశ్వతమగు రాజీ కుదురుట దుర్లభం. అందుచే ప్రభుత్వమువారు దానిని రద్దుచేయుటకు పూనుకొనుటయే గాక, ప్రజలకు తగు వాగ్దానం ఇవ్వాలి"

కాన్పూరు సమ్మె సందర్భములో యు. పి. ప్రభుత్వమునకును, మిల్లు యజమానులకును మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాల సందర్భములో ప్రభుత్వపు దృక్పథాన్ని వెల్లడించాలని పైవిధంగా కాన్పూరు మిల్లు యజమానులు యు.పి. ప్రభుత్వానికి వ్రాస్తే దానిపై ప్రభుత్వం యిల్లా ప్రకటించింది.

"ఇందు విషయమై కాంగ్రెసు యొక్క అభిప్రాయ మిదివరకే వెల్లడించ బడినది. అందులో రెండవ అర్థానికి తావుండరాదు.

కాంగ్రెసు, అహింసకూ, అన్ని వర్గాల మధ్యను సుహృద్భావము, శాంతి, అందరికీ న్యాయం మొదలగు వాటికి పని చేస్తుంది—తదనుగుణంగా ప్రజా సామాన్యం - యొక్క, కార్మికులతో సహా - సుఖజీవనానికి పనిచేస్తుంది. జాతీయ పతాకం స్థానాన్ని ఎర్రజెండా ఆక్రమించాలని కోరదు. కాని ఇంకొక విషయాన్ని మాత్రం చెప్పాలి. కమ్యూనిజం ఒక రాజకీయ అభిప్రాయం. దీనిని ఎందరైనా ఎన్ని విధాలనైనా ద్వేషించవచ్చును. దీనిని అణచుటకు, బలిమిచేతనే, అసాధ్యము. నాగరిక దేశాలలో దీనిపై నిషేధం లేదు. అంతేకాదు బహిరంగంగా ప్రచారం చేస్తున్నారు. ఈ టిక్కెటు మీద ఇంగ్లండులోనే, శాసన సభలకు మొదలగు వాటికి ఎన్నికలలో పోటీ చేస్తున్నారు కూడా.

కమ్యూనిజాన్ని గురించి ఎత్తేటందుకు యజమానుల కేమీ అవసరం లేదు.

ఏమైనా కావలసినచో, కూలీలకు యజమానులకూ మధ్య నుండే సంబంధాలు ఏమైనా బాగుపడా లంటే ఆ సంగతి చెప్పండి, శాంతి భద్రతలను దేశంలో కాపాడటం బాధ్యత చూచి అవసరాన్ని బట్టి, ప్రజా సౌఖ్యాలను బట్టి వ్యక్తి స్వాతంత్ర్యమును బట్టి, అవసరమైన పని మేము చేయగలము.

మీకు, రక్షణ, చేసుకున్న ఒడంబడికలు నెరవేర్చుకోడం, లాకౌట్లు లేకుండా మీ ఫేక్టరీలు మీరు నిర్వర్తించుకోండి. వ్యక్తి స్వాతంత్ర్యంతో మీ కేమీ సంబంధం లేదు" అని ప్రభుత్వం ప్రకటించింది.

# మునగాల ప్రజల దుర్భర జీవితం!

## కాంగ్రెస్ కమిటీ ముందు వెల్లడించిన

## భయంకర విషాదగాధలు

7—9—38 వ తేదీని కొణకంచిలో సమావేశమైన పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు కమిటీ యెదుట, మునగాల యెస్టేటులో రైతుల స్థితి గతులను గురించి విచారించుటకు నియమింపబడ్డ ఉపసంఘమువారు తమ నివేదికను సమర్పించగా, కమిటీ దానిని అంగీకరించి ప్యాస్ చేసింది. ఉపసంఘము యెదుట సాక్ష్యమిచ్చిన రైతులలో కొందరి స్టేట్‌మెంట్ల యందలి భాగములు యిచ్చట ప్రకటించుచున్నాము.

### బావులలో అశుద్ధము!

శ్రీ కొండపల్లి రామచంద్రరావుగారు (కరివిరాలి కరణం) యీ క్రింది విధముగా స్టేట్‌మెంటు యిచ్చారు.

"1930 వ సంవత్సరంలో మా మునగాల జమీలో రైతులచే ఏర్పరచబడిన జమీన్దారైతు సంఘంలో మా గ్రామరైతులు కొందరున్నూ, హరిజనులున్నూ, నేనున్ను ఒక మెంబరుగా చేరియున్నాము. అప్పటివరకు మేము కరణములుగాను — ఈనాందార్లుగాను, రైతులుగాను, కూలీలుగాను జమీన్దారు గారివల్లను, వారి నౌకర్లవల్లను పడినటువంటి నిరంకుశమైన నిర్బంధములను అక్రమ దుండగములు, జరిమానాలును మొదలగు వాటిని శ్రీ ప్రకాశం పంతులుగారు — శ్రీ విశ్వనాథదాసు మహాశయోగారు (ప్రస్తుతం ఒరిస్సా ప్రధాన మంత్రి) మొదలుగాగల దేశనాయకులచే విపులముగా విచారించబడినవి. తదాది అనేక విధముల అందరు రైతులు పలుకష్టములతో భరింపలేక జమీందారు గారికి లోబడుట తటస్థించినను. మాగ్రామ హరిజన కుటుంబములు ముప్పది (జనము 80 మంది) నా కుటుంబము ముగ్గురితోను కడపటివరకు నిలిచియున్న వారము. అందుకై మాదిగల తాలూకు భూముల విక్రయములు, వారల తాలూకు అక్రమ జప్తులు, చాకలివారు — మంగలివారు — వడ్రంగులు మొదలగు పనివారలను బందు చేయించి గ్రామములలో ఉప్పు మిర్చి మొదలగు వెచ్చములు పుట్టకుండా, బజారులలో దొరుకకుండా, బావులలో నీరు త్రాగకుండా అశుద్ధము వేయించి, కాపురమే దుస్తరము చేయించి, నన్ను - నా కుటుంబములోను హరిజన కుటుంబములతో సహా స్వస్థానములో వుండలేనంతటి దుర్మార్గములు జరిపినందున, పది సంవత్సరము వరకున్న నైజాంలో కాపురం ఉండక తప్పనిసరి అయినది. ఇది అందరు ప్రభుత్వోద్యోగులు ఎరిగినదే. నాలుగు సంవత్సరములు కూలీలు సేద్యముకానివ్వక, అక్రమ శిస్తులు అంటగట్టి భూములు జప్తులుచేయించి, ఇతర జాయింటు శిస్తులుకూడా అంటగట్టి, మరిన్ని జాయింటు శిస్తులుకూడా మా స్వంతమునుండే వసూలు చేయుటకు జప్తులు జరిపి, నానా యిబ్బందులు పెట్టినారు. నావరకు నేను సర్కారు ఉద్యోగపేత్యా జీతము 11 మాసములు విచారణలేకుండా మినహాయించినారు. ఇతర క్రిమినల్-సివిల్-రివెన్యూ వ్యవహారములలో కోర్టులకు బెజవాడ జగ్గయ్యపేటలకు త్రిప్పుటలోను. నాపంటలకు నీరుపెట్టక, సేద్యము కానివ్వక పోవుటవల్లను 2000 రూపాయలు నష్టపడినాను. నాకు గ్రామములో మరి నీరు పుట్టకుండా అందరిచేత బాయ్‌కాట్ చేయించి, అందరు రైతులు మొదలగు వారివల్ల కొన్ని దండుగలు తీసుకొనియు, కొన్ని ప్రామిసరీనోట్లు, ఎగ్రిమెంట్లు వ్రాయించుకున్నారు. నా కష్టములు ఏరోజులో చెప్పితే తీరనివని మనవి చేసెదను."

### వెట్టి చాకిరి.

శిరిపురం గ్రామ కాపురస్థులైన కంభంపాటి ముత్తిగాడు మొదలైన 14 గురు మాదిగలు యిచ్చిన స్టేట్‌మెంటు:

...."మేమంతా 1929-30 సంవత్సరాలలో రైతు సంఘములో చేరి రెండు సంవత్సరాలు వెట్టిచాకిరి మానినామని మమ్ములను రాజాగారి కోటలోనికి పిలిపించి, సంఘములో చేరుతారా అని మమ్ముల దెబ్బలు కొట్టి, రెండు మూడు రోజులు అన్నం, నీళ్ళు లేకుండా పారాలో వుంచి, కొవ్వూరి మంగయ్యగారి వద్ద రు 200-0-0 అప్పు తీసుకున్నట్లుగా నోటు వ్రాయించి, డబ్బు యివ్వకుండా మాచే వేలు ముద్రలు వేయించినారు. మమ్ముల భయపెట్టినారు. తర్వాత నోటు అప్పును మేమే నగదు సొమ్ము యివ్వగా షుమారు మూడేళ్ళ క్రితము పూర్తిగా బాకీ తీరినదని చెప్పినారు. కాని తర్వాత అప్పటినుంచి యిప్పటివరకు వెట్టిపని చేయుచున్నాము. మా ఆసామి సంవత్సరము నకు మూడు మాసములు గుర్రాలకు, పశువులకు గడ్డికోసి, వాములుపెట్టి వప్పచెప్పాలి. మొగాళ్ళం వెళ్ళి కోసిన గడ్డిని వాములు వేసి వస్తాము. ఇవిగాక, సంవత్సరానికి ఎనిమిది మాసములు యీ గ్రామంనుండి వంతుల ప్రకారం రోజుకు యిద్దరు చొప్పున ఆసామి గడ్డి కోసుకొనిపోయి నడిగూడెం వెళ్ళి రాజాగారి కోటలో వప్పగించి రావాలి. పంతులు సరిగా వెళ్ళనినాడు దెబ్బలు కొట్టి మనిషికీ 1-4-0 జరిమానా వసూలుచేసి యున్నారు. తర్వాత యీ గ్రామంలో ఉన్న రాజాగారి మామిడి తోటకు తుమ్మకంపను మేమే లాగుకొని వచ్చి చుట్టూ కంప వెయ్యాలి........వేసవి కాలంలో మామిడికాయలు కోతకు వచ్చినపుడు తోటలోని కాయలను కోసికొనిపోయి, యిరవై ముప్పదిమంది గుమాస్తాలకు మేమే తీసుకొని వెళ్ళి యివ్వాలి. దొన్న కోతల రోజులలో రైతుల చేలలో బలవంతముగా దోసకాయలను తెచ్చి గుమాస్తాలకు అందరికీ యివ్వాలి. ... నడిగూడెం నుంచి గంగిశెట్టి గూడెం రోడ్డుకు కలిసే రోడ్డుమీద కంకరపోయుట, గానుగలు త్రిప్పుట, రాళ్ళు మోయుట మొదలగు పనులు చేయాలి. అందుకు మాకు రోజుకు సేరు బియ్యం మాత్రం యిస్తారు....

మాతో కంభంపాటి ఎర్ర ముత్తిగాడిని వడ్లు దంపుటకు మనుష్యులను పంపించమని కబురు చేస్తే, మనుష్యుల పంపించి, వెనకాల పోవాలెననుకొనేవరకు, బర్రె యీనితే బర్రెను పాలు తీసుకొని పోదామనుకొను చుండగా, జవాను వచ్చి, యింకా వడ్లు దంపుడకు పోకుండా ఆలస్యము చేస్తావని యీతబెరికతో దెబ్బలు కొట్టగా, ఎందుకునన్ను అన్యాయంగా కొట్టావు

కీ॥ శే॥ గుత్తికొండ సత్యనారాయణగారు

రైతు సేవకులగు వీరి మరణం వలన చాల నష్టం కల్గింది మన ఉద్యమానికి. సత్యాగ్రహ దినాల్లో పికెటింగు చేస్తున్న నాటి చిత్రమిది.

అని జవాను చేతిలోని బెత్తమును పట్టుకొనగా, జవాను బెత్తమును పట్టుకొని తిరగబడతావా అని మూడు రోజులు అన్నం, నీళ్ళు లేకుండా పారాలో ఉంచి, ముత్తిగాడిని కొట్టి, ఎప్పటికి జవాన్లకు తిరగబడకుండా ఉండాలని వానితో 25 రూపాయలకు కాగితము వ్రాయించుకొని వేలుముద్ర వేయించుకున్నారు. ప్రతి నెలకు పుట్టెడు వడ్లు దంచి యిచ్చి రావాలె. ఇందులో ఏమైనా సరే బియ్యముకు తక్కువైతే మావద్ద జరిమానా వసూలు చేస్తారు...."

### అర్ధరాత్రివేళ దెబ్బలు

రేపాల గ్రామ కాపురస్థుడు కందుల రాములు వ్రాసియిచ్చిన స్టేట్‌మెంటులో ఒక భాగం:

"నన్ను మునగాల జమీందారుగారు సుమారు సంవత్సరం క్రిందట ఒక నేరారోపణ చేసి, అర్ధరాత్రివేళ జమానులలో కోటగుమ్మము వద్ద వారి ఉద్యోగస్థుల నౌకర్లతో కొట్టించి, నెత్తురు వమునటుల చేసినందుకు భరించలేక నూరు రూపాయలు దండుగపెట్టి విడుదలమైనాను. ఇప్పటికిని ఆ దెబ్బల బాధచే నెత్తురు మధ్య మధ్య పడుతూ ఉన్నది...."

### గుమాస్తాలకు సప్లైలు

మాధవరం గ్రామ కాపురస్థులైన తోట హనుమయ్య మొదలైన నలుగురు దుకాణదారు లిచ్చిన స్టేటుమెంటు నుండి:

"సుమారు 1912 వ సంవత్సరం నుంచి శ్రీ నడిగూడెం జమీందరుగారి తరపున గుమాస్తాలు మా గ్రామమునకు వచ్చినప్పుడెల్ల తినుటకు బియ్యం, పప్పు, మిర్చి, పప్పు, నెయ్యి వగైరా సామానులకు చీట్లు వ్రాస్తారు. కాని డబ్బు ఎన్నడైన, అప్పటినుంచి యిప్పటివరకు, అడిగినప్పటికైనా యివ్వటంలేదు.... ఈ ప్రకారం మాధవరం మొత్తంమీద సుమారు 1000 రూపాయలకు చీట్లు యున్నవి."

### నిర్బంధించి ప్రోనోట్లు

"....అక్కడ (గూడెం) ఒక గదిలో మా వూరి బొచిమంచి నారాయణగారి పేర, కొండపల్లి రామచంద్రరావుగారి తోను, పాత మాదిగలతోను మాట్లాడకుండను, వారి యిండ్లకు పోకుండను, వారికి భోజనం పెట్టకుండను వప్పుకుంటూ ఖరారునామా వ్రాసియివ్వకపోతే నన్ను గదిలోనుంచి వెళ్ళనివ్వమని రాజాగారు అన్నారు. కాబట్టి నీవు అట్లా వ్రాసి యివ్వాలి గనుక తెల్లకాగితం మీద దస్కతు చెయ్యమన్నారు. నేను దస్కతు పెట్టినాను. ఆ కాగితంలో ఏమి వ్రాసినారని నేడు అడిగినాను. నారాయణగారి వద్ద నేను వంద రూపాయలు అప్పు తీసుకున్నట్లుగాను, వారు తిరిగి ఎప్పుడడిగితే అప్పుడు ఆ సొమ్మును చెల్లించేటట్లుగాను వ్రాయించుకొన్నారు."

కర్విరాల, 25-7-38 } ఉదప్పడూరు రామానుజాచార్యులు వ్రాలు.

"కరివిరాల గ్రామ కాపురస్థులు ఉదవుటూరి రామానుజాచార్యులుగారికి నేనెప్పుడున్ను ఎంత పైకమున్ను అప్పుపూర్వకంగా యిచ్చి యుండలేదు. వారివలన నేను ఎన్నడున్ను ఎట్టి ప్రామిసరీ నోటులున్ను, దస్తావేజులున్ను, కాగితములున్ను వ్రాయించుకొని యుండలేదు."

కర్విరాల, 24-7-38 } బొచిమంచి నారాయణ వ్రాలు.



# మార్క్సిజము: చారిత్రక భౌతికవాదము

శ్రీ కస్పా వాసుదేవరావు

ఈ వ్యాసము మూడు భాగములుగ విభజింప బడినది. మొదటి భాగమున మార్క్సు యొక్క సాంఘిక రాజకీయ భావములను గూర్చి తెలుపబడినది. రెండవ భాగము మార్క్సు పద్ధతిని గూర్చి తెలియజేయును. మూడవ భాగమున గతి తార్కికవాదమును వ్రాయబడినది.

1818 మే 5 వ తేదీని ప్రష్యా దేశమున నున్న రైను రాష్ట్రములోని ట్రైయర్ పట్టణమున మార్క్సు జన్మించెను. చిన్నతనములో హెగెల్ యాతనికి గురువుగా నుండెను. ఆకాలమున హెగెల్, కాంటు మొదలగు వారిచే నిర్మించబడిన భావవాదము (Idealism) బాగుగా ప్రబలియుండెను. తరువాత వీరితో మార్క్సు ఏకీభవింపక విప్లవ నాయకుడై ప్రతి విషయమును తీవ్రముగా విమర్శించుచు ప్రజల యొక్క కష్టములను పోగొట్టుటకు దారి తీసెను. 1844 మొదలు 1848 వరకు వర్గకలహముల సిద్ధాంతమును, అందు వివరముగా చెప్పబడిన భౌతిక వాదమును గూర్చియు, అతడు తీవ్రముగ ప్రచారము చేసెను.

మార్క్సుయొక్క గతి తార్కిక భౌతిక వాదము చారిత్రక భౌతికవాదము వలెనే యుండును. బాహ్య ప్రపంచము యొక్కయు మానవుని ఆలోచనాశక్తి యొక్కయు గతిని [Motion] గూర్చి తెలుపు శాస్త్రము మార్క్సు యొక్క గతి తార్కిక వాదము. "భావము స్వతంత్రమైనది" అని కాంటు అభిప్రాయము. "నైజమును కలిగించునది భావమ"ని హెగెల్‌యొక్క వాదము. కాని వీరి రెండు వాదముల నుండి వ్యతిరేకమైనది మార్క్సు సిద్ధాంతము. "పదార్థమే యింకొక రూపమున మనసు నందుండి నపుడు భావమనబడును" అని మార్క్సు వ్రాసినాడు. లెనిన్ యీ విషయమును గూర్చి యింకను విపులముగా వ్రాసినాడు. "గతి (Motion) లేని పదార్థ మెచ్చటను ఉండదు. నిజమగు ప్రపంచ స్థితియొక్క జ్ఞానరూపమే భావము. కానిచో వేదాంత చర్చలోపడి కొట్టుకొనుచుండు ఆత్మ తప్ప ప్రపంచమనునదే యుండదు"

మార్క్సు సిద్ధాంతము ప్రకారము ప్రపంచ చరిత్ర అంతయు మానవుని యవసరముల కొరకు గావించు పనులయొక్క సారాంశమే. ప్రదేశము, (Space) కాలము,జీవితమునకు ముఖ్యమైనవి. ఇందుమూలమున ఇవి నిజముగా నున్నవని తెలియును. ఈ కాల, ప్రదేశము లలో పదార్థ గతి జరుగుచుండును. ప్రకృతి యనునది అనేకకోట్ల సంవత్సరముల నుండి పరివర్తనము నొందుచు నేటి కీరూపము నొందినది. కాబట్టి, ప్రదేశము, కాలము మానవుని యందే యుండి, మానవునిమీద యాధారపడి మానవుని వలననే కల్గుచున్నవనెడి భావవాదుల యభిప్రాయము సహేతుకముగ నుండదు. మార్క్సు సిద్ధాంతము ప్రకారము మానవుడు తన అవసరముల కొరకు ప్రయత్నము చేయుచు జీవితము నందలి గతిని గావించుచున్నాడు. ఈ అవసరమే మానవుల సంఘ వ్యవస్థయందుంచి వుత్పత్తి, పంపకము (distribution) లను గావించు చున్నది. నీకేది యవసరమని ఒక కూలీనడిగిన, రోజుకు 10 అణాలనియో, లేక మరేమైన అనో చెప్పును. ఆ కూలీ తన యవసరములను ఎందుకు పొందలేకున్నాడో మనము తెలియచేసిన వెంటనే అతనికి తన శ్రమఅంతయు ఎట్లు దోచుకొనబడుచున్నదో తెలిసి వర్గచైతన్యము కల్గును. స్వార్థముకొరకై ఫ్యాక్టరీ యజమాని కార్మికుల నెంత కష్టపెట్టు చున్నాడో తెలిసిన వెంటనే సమ్మెలు చేయ నారంభింతురు. ఈ తమ సమ్మెలు కార్మికులు యవసరముల సంపాదించుకొనుటకు చేతురు. ఈ కోర్కెల సంపాదన కొరకు కార్మిక సంఘము లవసరము. ఈ పద్ధతి ననుసరించియే మార్క్సు శ్రామిక సంస్థ లుండవలెననియు, వాని మూలమున శ్రామిక నియంతృత్వమును, సోషలిస్టు పద్ధతులపై వుత్పత్తి, పంపకము (distribution) స్థాపించ వచ్చుననియు తెలియ చేసినాడు.

నేడు ప్రపంచమంతయు మూఢ నమ్మకముతోను అయోమయమగు వేదాంతముతోను నిండియున్నది. నేటి సంఘము నందంతటను ఘర్షణలు విరివిగాను, స్ఫుటముగాను కాన్పించును, ఉత్పత్తి సాధనములను చేతనుంచుకొన్న తరగతులే వస్తువుల యొక్క ప్రాముఖ్యమును, నిర్మింప గల్గియున్నవి. కాని కొలది సంవత్సరముల క్రితము నుండి చారిత్రక పద్ధతులను సంఘ పద్ధతులను మరి మెరుగుపరచిన తెలియజేయు ఒక క్రొత్త తత్వము బయల్వెడలినది. ఇదియే మార్క్సు యొక్క తత్వము. ప్రాక్పశ్చిమ వేదాంతముల నిర్హేతుకమైన భావవాదము యొక్క దోషమును యీలని తత్వము గుర్తెరిగింప జేసినది. వర్గ కలహములతో గూడిన నేటి సంఘమున, మార్క్సిజమ్ దోపిడిదారులకు మిక్కిలి భయము కల్గించు స్థానము నాక్రమించి యున్నది. సోవియటు రష్యాలోని నేటి కార్మిక కర్షకుల పరిస్థితులే మార్క్సిజము యొక్క ఔన్నత్యమునకు ప్రబల నిదర్శనములు. సాంఘిక విప్లవ సిద్ధాంతమును ఆచరణలో పెట్టుటయే మార్క్సిజం.

ఒకానొక సంఘములోని సభ్యులు పరస్పర విరుద్ధములైన సాంఘిక రాజకీయ ఆర్థిక సమస్యలు కల్గి వారి సాంఘిక జీవనము తీవ్ర విరోధములకులోనై యున్నదనుకొనుడు. ఆ పరిస్థితులలో శాస్త్రయుక్తమైనదృష్టితోసంఘము నందలి ప్రతి సమస్యను గమనించ వలయును. రసెల్ యొక్క "సోషలిజమ్" గాని, లాస్కీ యొక్క కమ్యూనిజము గాని యిట్టి శాస్త్రీయ పరిశోధనకు సరియైన దారి చూపలేవు. పైగా వారి యభిప్రాయములు మార్క్సు యొక్క అభిప్రాయములతో కొన్నిచోట్ల చాల విరుద్ధముగా కన్పట్టును. దీనికి కారణము వారు మిక్కిలి శాస్త్రీయమైన మార్క్సు సిద్ధాంతము నుండి చీలిపోవుటయే. ట్రాట్స్కీ బుఖారిన్ మొదలగువారు కూడ మార్క్సు సిద్ధాంతములలో అతి సూక్ష్మమైన విషయములలో ఏకీభవింపక పోవుటచేతనే వారు పెడత్రోవల బట్టిరి. సోవియటు సంస్థలలోని "ఆత్మ విమర్శనము" (Self criticism)ను గూర్చి తెలిసికొనినచో మార్క్సు సిద్ధాంతములకును ప్రజాసామాన్యమునకును ఎంతటి సంబంధము కలదో తెలియును. నాయకత్వమున సిద్ధాంత బేధము కల్గిన పై నాయకులలో బేధములనేకములు కలుగజేయును. గాని ఈబేధములు శ్రామిక వర్గమును మోసపుచ్చలేవు, సరియైన సిద్ధాంతమునకు గుర్తు ప్రజా సామాన్యములో కల్గు సరియైన విజయమే. ఈ శ్రామిక విప్లవము చారిత్రాత్మకమైనది. ఈ విప్లవమున ముఖ్యమైనది శ్రామిక వర్గము. కారల్ మార్క్సు యొక్క సాంఘిక విప్లవము వుత్పత్తి సాధనములను గల్గియున్న వర్గమును బలవంతముగ కూలద్రోయుటయే. ఈ వర్గ నాశనము చేయుటకు పెట్టీ-బూర్జువా వర్గం శ్రామిక వర్గమునకు మిక్కిలి సహాయకారిగా నున్నను పిదప వర్గనాశన సమయమున ఈ వర్గీయులెట్లు కంటకులుగా నుందురో అనుభవము మూలమున తెలియుచున్నది. బూర్జువా వర్గములు కూడ మానవకోటిలోనివారే యని వారి హృదయము మార్చుటకు ప్రయత్నించుట అశాస్త్రీయము. విద్రోహకరము. అదియొక వెర్రి కలవంటిది. శ్రామిక వర్గమును ఒక సంఘములోనికి తీసుకొని రావలయును. అ విధముగా ట్రేడ్ యూనియన్లు ఏర్పడును. కాని ఈ ట్రేడ్ యూనియన్లు సామ్రాజ్య వ్యతిరేక సంస్థలు గానిచో అవి సంస్కార వాదమును అవలంబించి పెడ మార్గములు పట్టిపోవును, సోషలిజమునకును, శ్రామికవర్గ ప్రభుత్వ నిర్మాణమునకును మార్క్సు సరియైన బాటను నిర్మించినాడు. గతి తార్కిక భౌతిక వాదము ననుసరించి మార్క్సిజమ్ యుండును. సంఘంలోని దోపిడిగాండ్ర నిర్మూలనమే మార్క్సిజము యొక్క ముఖ్యోద్దేశము. వుత్పత్తికిని, పంపకమునకును, పరిపాలించుటకును మార్క్సిజము ఒక శాస్త్రమువలె ఉపయోగపడును. అన్ని తత్వముల వలె సామాన్య తత్వముగాక, మార్క్సుయొక్క గతి తార్కికవాదము, తదితర వాదముల లోపము నన్నిటిని బయలు గావించును. చారిత్రక భౌతిక వాదము విశదీకరించు విషయములు వేర్వేరైనను ఆ విషయములు ఒకదానితో నొకటి సంబంధము గల్గి సూత్రముపై నాధారపడి యుండును. ఆర్థిక రాజకీయ విషయముల ప్రాముఖ్యతను మార్క్సిజమే సరియైన తీరున తెల్పియున్నది. ఆత్మ విమర్శనమే కాక కార్యాచరణకు కూడ దారి తీయునది మార్క్సిజము.

# లేఖలు

## చేనేత పారిశ్రామికుల

దుర్భర కష్టాలు.

హిందూదేశంలో మొత్తం 25 లక్షల చేనేత మగ్గాలున్నాయి. ఈ మగ్గాలపైన జీవించే వారి సంఖ్య ఒక కోటిమంది. మదరాసు రాజధానిలో 8 లక్షల మగ్గాలు గలవు. 10 లక్షల పారిశ్రామికులున్నారు. తిండి తరువాత మనిషికి కావలసినది బట్ట. ఇట్టి అత్యావశ్యకమైన ఇండియన్ (దేశీయ) పరిశ్రమకు, మదరాసు ప్రభుత్వంవారు చేసింది యేమిటో యీదిగువ సుచ హరించినది చదివిన అవగాహనౌతుంది.

కాంగ్రెసు అధికారానికి వచ్చిం తరువాత, నేత పరిశ్రమకంటూ, మదరాసు రాష్ట్రానికి రెండు లక్షల రూపాయిలు శాంక్షను చేసేరు. ఆ సొమ్ములోంచి యొక చిల్లిగవ్వైనా పైసంఘంవారికి చెందలేదు. స్పిన్నర్సు, ఎసోసియేషనువారు ఆ సొమ్మంతా అమాంతంగా మ్రింగేసేరు. విదేశ బట్టలమ్ము షాపులకు పన్నులు విధించేరు. అదిచూచి అమాయకులైన మూ వాళ్ళందరూ చాలా బాగుంది మన పరిశ్రమ వృద్ధిపొందు తుందని మురిసిపొయ్యేరు. ఇది యొక రాజకీయ తంత్రంఅనిన్నీ, ప్రభుత్వంవారి బొక్కసానికి డబ్బు కూర్చడం అనిన్నీ పాపం వారు గ్రహించలేక పొయ్యేరు. వీళ్ళకు ఫ్రీ (Free) లైసెన్సు ఉండాలని శాసించారు. దినమంతా గుడ్డలు నేసుకుని, యీ కష్టజీవులు వారి రెక్కలకష్టం అమ్ముకోక తప్పదు. యీనేత పారిశ్రామికులకు లైసెన్సు, ఫ్రీ లైసెన్సుల గొడవేమిటో తెలియని స్థితిలో ఉండడంబట్టి, పట్టెలూళ్ళలో వీళ్ళపాలిటికి మునసబు కరణాలు ఉద్దండులై నిలిచారు. దుండగాలు చేస్తున్నారు. వాళ్ళ నిరంకుశత్వానికి మేరలేదు.

గుంటూరులో గౌ॥ ప్రధాన మంత్రి రాజాజీ గారు బట్టల మిల్లులకు చేనేత పరిశ్రమలకూ, మధ్యనుండే సంఘర్షణను గూర్చి యిట్లాచెప్పేరు

"అటు హామీదకు సింహం వస్తోంది. ఇటు చంటిపిల్లాడు ఆకలితో యేడుస్తున్నాడు. పిల్లాడిని కాపాడాలంటే సింహం తినేస్తుంది. పాసీ సింహాన్ని చంపేద్దామంటే, పిల్లాడు ఆకస్తో చచ్చిపోతాడు. కాబట్టి ఏమిచెయ్యాలో మీరే చెప్పండి" అని మాట్లాడేరు. వీరిమాటల భోరణి విమర్శించి చూస్తే యీ చేనేత పారిశ్రామికులపై ప్రేమ వ్యక్తమవుతుంది.

ఈ చేనేత పారిశ్రామికుల బాధల నీదిగువ నొకటి రెండు మాత్రం చెప్పి ఊరుకుంటాను.

1. స్వదేశీ విదేశీ మిల్లులపోటీ 2. స్థానికంగా ఉండే షాహుకార్ల నిరంకుశత్వాలు. 3. 1934 సం॥ ఇండో జాపాను పాక్టు.

స్వదేశీ విదేశీ మిల్లుల పోటీవల్లను; జపాను డంపింగువల్ల చేనేత పారిశ్రామికుల కష్టానికి ఫలితం సూన్యం అయిపోయింది.

ఇండో జాపాన్‌పాక్టు సారం ఏమంటే, హిందూ దేశంలో పండిన దూదిని జపాను తీసుకొని క్రయ ద్రవ్యానికి మారుగా వారిదేశం మిల్లులలో తయారైన బట్టను మాత్రమే యివ్వడము. ఈ సంధివలన జపాను సైనుతానులు ముమల గుడ్డలు మొదలైనవి తండోపతండంగా ఏగుమతి అవటం: గత్యంతరం లేక హిందూ దేశవు వస్త్రములు అమ్మడం తటస్థించింది. చేనేత పారిశ్రామికుల కూటిలో మట్టిపడింది. సౌకర్యాలన్నీ ధనాఢ్యులకు, దుర్భర దుఃఖాలన్నీ నిరుపేదలకు సంభవించాయి.

ఈ చేనేత పారిశ్రామికుల కష్ట నష్టములను ప్రభుత్వంవారి ఎదుట మొరపెట్టుకుందామంటే, శాసనసభల తలుపులు వీరికి తెరువబడిలేవు. మిల్లు నేత కార్మికులకు, మదరాసు రాష్ట్ర శాసనసభల్లో రెండు సీట్లు ప్రసాదించారు. ఈ రాష్ట్రంలో ఉన్న పది లక్షల చేనేత పారిశ్రామికుల కష్టాలు నివేదించుకోటానికి, ఒక్క స్థానమైనా శాసన సభలో లేదు.

షాహుకార్లకు, షాహుకార్లకు, కాంపిటీషను వడితే, కూలీల బత్తేలు కూలవలసిందే. గాని, వస్తువుల లాభాల్లో ఒక్క గవ్వైనా తగ్గ కూడదు. ఇందుకు నిదర్శనం—పశ్చిమ గోదావరి జిల్లాలో పాలకొల్లు మొదలగు ప్రాంతాల్లో, తలగుడ్డల సాపుకు మామూలుగా రు 4-0-0 మొదలు 4-8-0 వరకూ మజూరీ రివాజు. పోటీ వస్తే, రూపాయిన్నరో లేకపోతే రెండో యిస్తారు, వీళ్ళ మజూరీలు తగ్గించి ఆ మొత్తానికి బట్ట ఖరీదు తగ్గించేస్తారు. నష్టం కష్టం కూలీలది. పుష్టీ పుణ్యం వర్తకుల్ది అన్నట్లు సంచరిస్తున్నారు వర్తకులు. ఒక వారం రోజులు ఖుమూటి నలుగురు నిర్మాతలు కష్టపడి నేస్తేనేగాని, ఒక పాగ తయారుకాదు. ఈ నలుగురికి వారం రోజుల వేతనం క్రింద రెండు రూపాయలు ముట్టును. వారానికి రెండు రూపాయలు నలుగురు మనుష్యులు సంపాదించారంటే, ఒక్కొకరికి, అర్ధరూపాయి కిటుతుంది. ఈ యర్ధరూపాయితో వారం రోజులు, వీరూ, వీరి కుటుంబం పొట్టలూ యెట్లా గడుస్తాయో ఆలోచించండి, ఇదిగాక ధర్మాలపేరిట-మూర్తికి ఒక కాని (0-0-3) గుంజుకుంటారు. ఇదంతా తమ తీర్థాలకు తిరనాళ్ళకు వినియోగిస్తారు. ధర్మం పేరిట. ఆకలితో మల మల మాడిపోతున్న చేనేత పారిశ్రామికుల నుండి ఆరు లక్షల (6,00000) రూపాయలు షావుకార్లు హరించేస్తున్నారు.

కార్మిక కర్షకుల బాధలు గుర్తించి ముందడుగు వేసి సహృదయులగు నాయకులు మమ్మల్ని రక్షించాలి.

రాజమండ్రి.
10-8-1938.

ఇట్లు,
గుడిమెట్ల గంగరాజు.

* * *

### తూర్పు కృష్ణాజిల్లా బోర్డు వింత చర్యలు.

గుడివాడ పట్టణమందు అనేక సంవత్సరముల నుండి రోడ్డు ప్రక్కనున్న స్థలములలో బడ్డీలు పాకలు వేసుకొని పలుమంది ఓదలు చిన్న చిన్న వ్యాపారములు చేసుకొని జీవించుచున్నారు. లోగడ జిల్లాబోర్డు ప్రెసిడెంటు గారైన మీర్జాపూరు జమీందారుగారు సదరు స్థలములను ప్రతి సంవత్సరం వేలమువేసి ఎక్కువ పాటదారునకు యిచ్చుచుండిరి. పాటదారు లోకల్‌బోర్డు యాక్టు ప్రకారము దుకాణదార్లు యిచ్చుకొనవలసిన పన్నును రోజువారిగా వసూలు చేసేవారు. వీరలమగు మాకూ కష్ట నష్టములు లేకుండాను, వారికీ డబ్బు నష్టం లేకుండాను వసూలు అయ్యేవి. యిటీవల 30-9-37 తేదీని అకస్మాత్తుగా 15 రోజుల లోపల రెండు సంవత్సరముల పన్ను పూర్తి మొత్తమును యివ్వవలసినది గాను అటు యివ్వనియెడల సివిలుకోర్టులో ఖర్చులతోగాబట్టు కొటుమనవనియు బోర్డువారునోటీసులుయిచ్చినారు. దుకాణదారులలో కొందరు 2 మాసముల క్రితమున్నూ 4 మాసముల క్రితము కొందరున్నూ ఇల్లాగే 5 మాసముల క్రితమున్నూ దుకాణములు పెట్టినవారున్నూ, అయి యున్నారు, బోర్డువారు అందరికీ రెండు సంవత్సరములు పన్ను విధించి యున్నారు. తరువాత గుడివాడ డి॥ మునసబు కోర్టు ద్వారా మాకు సమ్మన్లందినవి. ప్లీడరును నియమించుటకు మాకు శక్తిలేక స్వయముగా కష్ట నష్టములను కోర్టు మునసబుగారికి విన్నవించు కొన్నాము. ఎంత మొరపెట్టుకొన్నను చివరకు యీ పీడలకు కలిగిన ఫలితములు డిక్రీలు. కడుపునిండా తిండి ఒంటినిండా బట్ట లేని మాబోటి పేద ప్రజలు యీ మొత్తములను చెల్లించుట చాల కష్టము. కావున యీ అన్యాయమైన పన్నునకు బలియగుచున్న యీ 300 మంది ప్రజలను యీ ఆపత్తునుండి తప్పించ కాంగ్రెసు ప్రభుత్వమువారిని ప్రార్థించుచున్నాము.

ఇట్లు
దుకాణదారులమగు
(1) పార్లపల్లి లక్ష్మీనర్సారెడ్డి,
(2) మరడ నరసింహ్మారావు.

* * *

### వేరుశనగ పంటపై అదనపు పన్ను.

— తురిమెళ్ళ.

వేరుశనగకాయ పైరువేసిన భూములకు, యకరమునకు, రు 5-0-0 లు అదనపు పన్ను వేయుదురని ఒకవార్త పైపులలో ప్రబలిపోయినది. ఇది నిజమే అగుచో రైతు లోకానికి గొప్ప హాని జరుగును. గాన యీ విషయమై ప్రభుత్వ నిశ్చితాభిప్రాయము ప్రకటించి రైతుల అనుమానాన్నిపోగొట్ట ప్రార్థన.

కర్నూలు జిల్లా

ఇట్లు
చేగిరెడ్డి వెంకటమ్మ

* * *

### షాపు గుమాస్తాల దీనదశ.

అన్ని పట్టణములలోను పలువిధములగు వ్యాపారస్థులవద్ద అనేక మంది గుమాస్తాలు ఉన్నారు. వీరిలో మూడు తరగతులున్నాయి. యీ మూడు తరగతులవారున్నూ వోవర్ వర్కు డబుల్‌వర్కు చేయువారే.

తరగతులు (1) హెడ్‌గుమాస్తాలు (2) అసిస్టెంటు గుమాస్తాలు (3) వాలంటరి గుమాస్తాలు (నేర్చుకొను వారు) యీమూడు తరగతుల గుమాస్తాలున్నూ ఉదయము 9 గంటలనుండి సాయంత్రము 8, 9 గంటలవరకు పని చేయుచున్నారు. అనగా రోజుకు 14 లేక 15 గంటల పని. యీ టయిములో మధ్యాహ్నము భుజించుటకు సెలవు. ఆసెలవుకు నియమములేదు. యజమానుల దయాదాక్షిణ్యములచే కలిగిన ఆసెలవును కొన్నిచోట్ల యజమానుల యిష్టమువచ్చినప్పుడునూ కొన్నిచోట్ల పని తీరినప్పుడునూ యీగుమాస్తాలు వుపయోగించుకుంటూ వుంటారు. డబుల్‌వర్కు— కొన్ని చోట్ల వొక హెడ్‌గుమాస్తా, వొక అసిస్టెంటు గుమాస్తా యున్నూ, కొన్నిచోట్ల ఒక గుమాస్తా ఒక వాలంటరీయున్నూ వుంటారు. కాని మరికొన్ని చోట్ల ఒక గుమాస్తామాత్రమే వుంటారు. హెడ్‌గుమాస్తా అసిస్టెంటు గుమాస్తా యున్న చోట్ల యజమాని తన కోర్టు వ్యవహారములన్నిటిని హెడ్‌గుమాస్తాచేత చేయించుకొని మిగిలిన యే 1, 2 గంటల కాలమైనను విశ్రాంతి నివ్వక వ్యాపారపు లెక్కలను తయారు చేయించు కుంటారు. హెడ్‌గుమాస్తా కోర్టు వ్యవహారముల నుండి వచ్చులోగా అసిస్టెంటు గుమాస్తాయే పనినంతయూ చూచుకొనవలెను. ఒక వాలంటరీ, ఒక గుమాస్తా యున్నచోట్ల వాలంటరీ యజమాని యింటివద్ద చాకిరిచేస్తూ వుంటారు, గుమాస్తా వ్యాపారపుపని, యజమాని స్వంతపని చూడవలెను. వాలంటరీ యజమాని యింటి పనులన్నియు చక్కజేసి కొట్టువద్దకువచ్చి విశ్రాంతిలేని గుమాస్తాను యేమైనా లెక్కలు నేర్పమంటే గుమాస్తా విసుక్కుంటూ వుంటారు. యిక ఒక గుమాస్తామాత్రమే పని చేయుచుండే చోట్ల యింకెన్ని యిక్కట్లు ఉన్నవో ఊహింపుడుగాక.

ఎవరైనా ఒక గుమాస్తా యింతపని చేయలేనని చెపితే ఆరోజునుండి అతను నిరుద్యోగులలో చేరవలెను. యింతకాలము కష్టపడి పనిచేసినా వీరికి ప్రతి నెలకు రు 10-0-0 నుండి రు 20-0-0 వరకు సర్వీసును బట్టి జీతాలుంటాయి. హెడ్ గుమాస్తాలకు 25 లేక 30 వరకు జీతాలిస్తారు. వీరి జీవితమంతయు నౌకరితోనే గడపినను యింతకంటె ఎక్కువ జీతము పొందలేరు. ఎక్కడయినా ఒక గుమాస్తా ఎక్కువ జీతము కోరితే "నీవు వెళ్ళిపో. నీతాతలు పదిమంది వస్తారు. బి. ఏలు చదివిన వారుకూడా రు 15 లు అసిస్టెంటు గుమాస్తాగా పనిచేయుటకు ఒప్పుకుంటావున్న యీ రోజులలో నీకెవరు గొప్ప జీతాలిస్తారు" అని గట్టిగా చెప్పుతారు. యిన్ని విధములుగా యీ గుమాస్తాలను యజమానులు మ్రింగి వేస్తున్నారు.

కర్తవ్యము.

యజమానుల యిట్టి చర్యలను ఎదుర్కొనవలెనంటే గుమాస్తాలలో కూడా చైతన్యం వృద్ధిపొందాలి. ప్రతి గ్రామమున గుమాస్తాల సంఘాలు నెలకొల్పాలి. తమ కష్టములను వీలైనంతవరకు తగ్గించమని యజమానులను కోరాలి.

శిఖాకొల్లి మహానందీశ్వరుడు.





## కాంగ్రెసు.

### కృష్ణాజిల్లా దేశ సేవకులకు విజ్ఞప్తి.

తిరువూరు, నూజివీడు, నందిగామ తాలూకాలలో జమీంగారీ రైతులు పడుచున్న బాధలు మితిమీరి పోవుచున్నవి. కాంగ్రెసు ప్రచారము లేనందుచే జమీందారీ నిరంకుశత్వము బలహీనపు రైతుల మీద ప్రతి దిన మెచ్చుటనైనను ప్రయోగింపబడు చున్నది. యిట్టి ఆపత్సమయమందు రైతుకోటికి సహాయము చేయుచుండిన, మనము చేయునదిం కేమున్నది. 28-8-38 వ తేదీన తిరువూరు తాలూకాలో కాంగ్రెసు శిబిరము నెలకొల్పి కొంతమంది వాలంటీయర్లు జట్లు, జట్లుగా గ్రామాదుల వెంట ప్రచారమునకు బయలుదేరుదురు. అదే విధముగా నూజవీడు, నందిగామ తాలూకాలలో కూడ శిబిరములు నెలకొల్పి దాదాపు మాసము రోజులైననూ గ్రామాదుల వెంట ప్రచారమునకు బయలుదేరవలసి యున్నది. సదరు మూడు తాలూకాలలో ప్రచారము చేయవలెనన్న కనీసము 50, 60, మంది దేశ సేవకులు కావలసి యున్నారు గాన, కృష్ణాజిల్లా దేశ సేవాభిలాషులందరు యీ తరుణమున మనవిధి నెరవేర్పుటకు దయచేయ ప్రార్ధన. 19-8-38 వ తేదీన బెజవాడలో జిల్లా కాంగ్రెసు ఆఫీసుకు దయచేసిన అచ్చట నుండి వేరు వేరు తాలూకాలకు వెళ్ళుటకు ఏర్పాట్లు జేయుదురు.

కాకాని వెంకటరత్నం.
ప్రధాన కార్యదర్శి
ప. కృష్ణా జిల్లా కాంగ్రెసు కమిటీ.

నర్సాపురం తాలూకా కాంగ్రెసు సంఘము ది 5—8—1938 తేదీని దర్బులూరులో సమావేశమై యీ దిగువ విషయాలపై తీర్మానాలు గావించినది:

1. తాలూకాలో జాతీయ ఉద్యమమును తోవ్వపరుచుటకు ఒక వలంటీరు దళాన్ని ఏర్పాటు చేయుటకును, అందుకు 1. గొట్టుముక్కల వెంకన్న గారు యం. యల్. ఏ. 2. అల్లూరి సత్యనారాయణగారు మరి కొందరితో కలసిన ఉపసంఘాన్ని నియమించారు.

2. కాశీపట్నం ప్రజలకు సానుభూతిని చూపుచున్నారు.

3. రానున్న జిల్లాబోర్డు ఎన్నికలలో కాంగ్రెసు సివిక్‌బోర్డు సభ్యులు ఎవరునూ అభ్యర్థులుగా నిలువరాదు అని జిల్లా సంఘానికి సూచించుచు తీర్మానించారు.

4. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమువారికి యీక్రింది సూచనలు యీ కమిటీవారు చేయుచున్నారు. కాంగ్రెసు ఎన్నికలు యీ విధంగా జరుగునట్లు చేయాలి.

(1) పరోక్ష ఎన్నికలు సింగిల్ ట్రాన్స్‌ఫరబుల్ ఓటుద్వారా జరుగవలయును. జిల్లా సంఘమునకు ప్రత్యక్ష ఎన్నికలు, జిల్లా సంఘము నుండి రాష్ట్ర సంఘానికి, రాష్ట్ర సంఘము నుండి అఖిలభారత సంఘానికి పరోక్ష ఎన్నికలు ఉండవలెను.

(2) జిల్లా నియోజక వర్గము కనీసము 10 ఏండ్లవరకూ నిర్ణీతమై యుండాలి. నియోజక వర్గములు జనసంఖ్యనుబట్టి ఏర్పరచవలయును. జిల్లాసంఘ సభ్యత్వము 100 మందికి మించకుండా ఉండునట్లు నియోజక వర్గములు ఏర్పరచ వలయును.

(3) ప్రతి గ్రామ నియోజక వర్గములోనూ ఆ నియోజకవర్గములోని వారివారి సభ్యత్వ సంఖ్యననుసరించి యీక్రింది తరగతులకు [illegible] సీట్లు విభజించి ఎన్నికలు ఒక్కొక్క తరగతికి ప్రత్యేకముగా ఎన్నికలు జరుపవలెను. 1. రైతులు 2. వ్యవసాయపు కూలీలు. 3. చేతి వృత్తిదారులు దుకాణదారులు తదితరులు.

(4) పై మూడు తరగతులకు చేరిన స్త్రీలు పై తరగతులకు కనీసము ఒక్కొక్కరికి ఒక్కొక ప్రతినిధి అయినా ప్రతి నియోజక వర్గమునుండి ఉండవలయును. కాని ప్రతి తరగతి 100 మందికి తక్కువ గాకుండా సభ్యులు కలిగి ఉంచాలి. ఏ తరగతి కూడా 5 గురు ప్రతినిధులకన్న ఎక్కువ ఉండకూడదు. అన్నిటికన్న తక్కువగా చేరిన తరగతి సభ్యుల సంఖ్య 100 దాటినపుడు వీరి సంఖ్యకన్న మిగిలిన తరగతుల సభ్యత్వపు ఎన్నిరెట్లు ఉంటుందో అందరు ప్రతినిధులు 5 గురికి మించనంత వరకూ ఉందురు.

5. యీ నియమమే ప్రతిపట్టణ నియోజక వర్గమునకు వర్తించును. కాని తరగతులు మాత్రము యీక్రింది రీతిని ఉండును. 1 కార్మికులు 2 దుకాణదారులు, చేతి వృత్తిదారులు 3. తదితరులు 4 స్త్రీలు.

6. ప్రతిజిల్లా సంఘ ప్రతినిధికి నల్గురు తాలూకా, పట్టణ, సంఘ సభ్యులుగా యుందురు. వీని ఎన్నికలుగూడ 3, 5 లలో సూచించిన నియమముల ననుసరించి జిల్లా సంఘపు ఎన్నికలతోబాటు జరుగును.

పాలకొల్లు.
7-8-38.

ఇట్లు,
ఉద్దరాజు సూర్పరాజు.
ప్రధాన కార్యదర్శి.
నర్సాపురం తాలూకా కాంగ్రెసు సంఘం.

* * *

కొవ్వూరు తాలూకాలో, కామ్రేడ్సు, యస్. ఆర్. దాట్ల, అబ్దుల్ మజీద్ ఖాదాగారలు, మరి కొందరు సోదరులున్ను గలసి, కాలి నడకను తాలూకా అంతయు తిరుగుచూ కాంగ్రెస్ ప్రచారం చేయుచున్నారు. 7వ తేదీని తాళ్ళపూడిలో సభ జరిపిరి.

## కాంగ్రెసు సోషలిష్టు పార్టీ

అఖిల భారత ఫెడరేషన్ ప్రతికూల ప్రచార కమిటీని ఒకదానిని ఏర్పాటు చేయుటకు బెంగాల్ కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ తరపున, శివనాథ బెనర్జీ,బంకిం ముఖర్జీగారలు అన్ని రాష్ట్రములందలి ఫెడరేషన్ ప్రతికూలురను కోరుచూ ఒక ప్రకటన చేశారు.

*

### నెల్లూరు

నెల్లూరు జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యనిర్వాహక వర్గ సమావేశము 31-7-38 వ తేదీ మధ్యాహ్నం 4 గంటలకు విడవలూరులో కామ్రేడ్ రంగయ్యగారి అధ్యక్షత క్రింద సమావేశమై గావింపబడిన తీర్మానములు:

రాష్ట్ర పార్టీ, వ్యవసాయ కూలీ సంఘాలకు, రైతు సంఘాలకు ఉండవలసిన సంబంధమును గురించి సూచించిన యీ క్రిందిరెండు సూచనలలో మొదటి సూచనను [illegible] మనామము.

### మొదటి సూచన.

(1) వ్యవసాయ కూలీ సంఘాలు రైతు సంఘాలకు అనుబంధంగా లేకుండా, స్వతంత్రంగానే యుండాలి. కాని, కూలీ సంఘాలలో పని చేసేవారున్నూ రైతుల్లో పనిచేసే వారున్నూ గ్రామాల్లో 15 రోజుల కొకమారైనా కలసి, విషయముల చర్చించి, ముందు కార్యక్రమము నిర్ణయించుకోవాలి.

(2) రైతులకు కూలీలకు తగాదాలు వచ్చినప్పుడు ఆర్బిట్రేషన్ కమిటీలద్వారా తగాదాలను పరిష్కారము చేసుకోవలెను. ఆర్బిట్రేషన్ బోర్డులో యీ క్రింది వారుందురు.

(ఏ) జిల్లా రైతు సంఘమునుండి యిద్దరు
(బి) జిల్లా కూలీ సంఘమునుండి యిద్దరు
(సి) జిల్లా సోషలిస్టు పార్టీనుండి ఒకరు.

యీ ప్రతినిధులను జిల్లా కార్యనిర్వాహక వర్గములు నిర్ణయించును. సోషలిస్టు పార్టీ నుండి వచ్చు ప్రతినిధి యీ బోర్డుకు అధ్యక్షుడుగా నుండును. యీ సంఘమువారు మరల నూతన సంఘము వచ్చువరకు పనిజేయుదురు.

(3) జిల్లా కూలీ సంఘముల సభలకు కూలీ సంఘమువారు సౌహృద్రప్రతినిధులను పంపవచ్చును.

### రెండవ సూచన.

(1) వ్యవసాయ కూలీ సంఘములు గ్రామాలలో ప్రత్యేకముగా ఉండవలయును. కాని జిల్లాలో వ్యవసాయకుల సంఘము అనునది ఒకటే ఉండాలి. యీ సంఘమునకు గ్రామములో రైతు సంఘాలు, కూలీ సంఘాలు చేరి యుండాలి. యీ వ్యవసాయకుల సంఘ నిర్ణయాలను గ్రామములలో రైతు సంఘాలు కూలీ సంఘాలు శిరసావహించాలి,

(2) ఆంధ్ర రాష్ట్ర వ్యవసాయ కూలీ సంఘ కార్యదర్శి గారైన వెన్నెలకంటి రాఘవయ్యగారు వ్యవసాయ కూలీయాత్ర అనుకర పత్రములో పాలేర్లకు (సేద్యగాండ్రకు) నెల 1కి దాదాపు రు 13-8-0 లు అనగా రోజు 1కి 0-7-2 దాని తర్వాత 6 వ కరపత్రములో దిన కూలీలకు రోజు 1కి 0-4-0 లు అనియు ప్రకటించినారు. ఈ విధముగా వ్రాయుటలో అర్థము లేకపోవుటయే గాక యీరోజు కలిసి పని జేయుచున్న పాలేర్లకు దిన కూలీలకు ఐక్యత చెడుననియు అభిప్రాయపడుచూ పాలేరులకు సూచించిన కోర్కెలు యీరోజు చాలా మంది రైతులు యిచ్చుటలేదని, కార్యదర్శిగారు పై కోర్కెలు యీ రోజు సమ్మెచేసి సంపాదింప వలసినదని చెప్పినందువలన రైతు కూలీ సంఘముల ఐక్యత చెడి స్వాతంత్ర్య పోరాటమునకు భంగకర మగుటయే గాక సమ్మె చేయుచున్న గ్రామాదులలోని పాలేర్లు యింత వరకు కోర్కెలు యెచ్చుట కోరలేదనియు తెలియజేయుచూ, పోరాటము జరుగుచున్న యీ సమయములో యీ క్రిందికోర్కెలుగల కర పత్రములను వేయించి అవి వచ్చునంతవరకు తీవ్రమైన ఆందోళన సాగించి రైతు కూలీ ఉద్యమములను స్వాతంత్ర్య పోరాట [illegible] వలసినదిగను కోరుచు [illegible]

నెల 1కి 3 తూముల జీతము.

సంవత్సరము 1కి 12 తూముల పెట్టుబడికి తక్కువ గాకుండా.

నెలకు 2 రోజులు సెలవు;

సగము పెట్టుబడివరకు వడ్డీ లేకుండా యిచ్చుట (తాను అడుగునాటికి తనకు రావలసిన దానిలో సగము).

దిన కూలి.

రోజు 1కి 3 మానికలకు తక్కువలేకుండా.

అందరికి సరియైన కొలత పాత్రలతో మేలు రకము వడ్లే యివ్వవలయును.

బి. శంకరయ్య.
కార్యదర్శి.

## విద్యార్థి సంఘాలు

### విశాఖపట్నపు విద్యార్థి సంఘము.

ఈనెల 7వ తారీఖున 11 గంటలకు పూర్ణ థియేటరులో పై సంఘపు రెండవ వార్షిక సమావేశము, ఆర్. జి. హార్డింజ్ (మెడికల్ కాలేజీ విద్యార్థి) అధ్యక్షత క్రింద జరుపబడెను. "వందే మాతరం" గీతముతో సభా కార్యక్రమము ఆరంభింపబడెను. తరువాత కార్యదర్శి వెంకట్రామ శాస్త్రిగారు జరిగిన సంవత్సరపు నివేదికను చదివిరి.

తరువాత సంఘపు నిబంధనలలో కొంత మార్పు జరిగెను. అటుపైని కొత్త సంవత్సరపు కార్యనిర్వాహకవర్గము ఎన్నుకొనబడెను.

తరువాత ఈ క్రింది తీర్మానములు ఆమోదింపబడెను:

1. యిటీవల కాలేజీకి విద్యార్థులీయవలసిన జీతములలో చేయబడిన హెచ్చును తీసివేయవలెననియు, డిసిప్లినరీ రెగ్యులేషన్లు రద్దు చేయవలెననియు, రాజకీయములలో పాల్గొనుటకు వీలుకల్గునట్లుగా నిబంధనలు మార్చవలసినదిగాను, మెడికల్ కాలేజీకి రికగ్నిషన్ వచ్చు విధంగా హాస్పిటల్‌ను వృద్ధిచేయ వలసినదిగాను గవర్నమెంటు వారిని కోరిరి.

2. పరీక్ష ఫీజు, 50% తగ్గింపవలెననియు, పరీక్ష పత్రములు రోజుకు వకటిగా చేయవలసినదిగాను, విద్యార్థులను సెలక్షనులో డిటైను చేయుపద్ధతి తీసివేయ వలసినదిగాను, ఎడ్మినిస్ట్రేషను ఖర్చును తగ్గించి విద్యావిషయమై ఖర్చు చేయవలసినదిగాను, సెనేటు మీటింగులకు పబ్లిక్‌ను విద్యార్థులను ప్రేక్షకులను రానీయుటకుగల అభ్యంతరమును తొలగింపవలెననియు; మొదలైన విషయములు యూనివర్సిటీ అధికారులకు తెలియపర్చుట.

3. హాస్టల్సు,స్పోర్ట్సు మొదలైనవాటి మేనేజిమెంటు విద్యార్థుల కిమ్మవలసినది గాను, విద్యార్థి సంఘమును రికగ్నైజు చేయవలసినదిగాను కొట్టుట మొదలైన పనిష్‌మెంట్లను స్కూళ్ళలో రద్దుచేయ వలెననియు స్కూళ్ళ అధికారులకు తెలియపర్చుట.

తరువాత స్పెయిన్, చైనా విద్యార్థులను అభినందించుచూ, ట్రావన్కూరు విద్యార్థులపై జరిగిన లాఠీఛార్జీలను ఖండించుచూ, [illegible] శాఖను తీసివేయవలసినదిగా కోరుచూ, మరి కొన్ని తీర్మానములు చేయబడెను. తరువాత సభ ముగిసెను.

పట్టాభిగారి మెడ్రాస్ స్టేటుమెంటు (విద్యార్థులపై) ను ఖండించుచు యింకొక తీర్మానము ఆమోదించబడెను.

తాడంకి [illegible]

తాడంకి బోర్డు హైస్కూలు విద్యార్థి సంఘము 11-8-1938 తేదీని సమావేశమై [illegible] తీర్మానాలు కొన్ని చేసినది [illegible]

# నిర్బంధ విధానము

సాగించడానికి మరొక చట్టమా!

(6 వ పేజీ తరువాయి)

యీ ఆందోళన జూచి ప్రపంచ సంగ్రామంలో మన గతి యేమి అని ఆలోచించుకొనేటట్లు చేయాలి.

ఈ ఆందోళనను గమనించక మొండితనంగా యీ బిల్లును దేశముపై బలవంతముగ రుద్దినను, మనపని మనం మాన కూడదు. సామ్రాజ్య యుద్ధాలు అంటే ప్రజలకు అసహ్యం, అనాదరణ కలుగునట్లును, ఎవరూ సైన్యములో చేరకుండునట్లును, ఒకవేళ బలవంతముగా సైన్యాలలో చేర్చబడినను సామ్రాజ్య వాదులకు ఏవిధముగానూ సహాయము చేయకుండా యుద్ధం మానివేసేటట్లు ప్రచారం సాగించాలి. ఒకవంక, యుద్ధానికి వ్యతిరేకంగా తీర్మానాలు చేసిన కాంగ్రెసు మహాసభ ప్రతినిధులు 7 రాష్ట్రాలలో పరిపాలన సాగిస్తూంటే యిట్టి బిల్లును బ్రిటిషు ప్రభుత్వము తీసుకొని వస్తోంది అంటే, యుద్ధానికై ఎంత తపిస్తోందో స్పష్టమగుచున్నది.

యీ యుద్ధంలో భారత దేశాన్ని తన గులామువలె బ్రిటిషు ప్రభుత్వం ఉపయోగించుకోవాలంటే ఫెడరేషన్ మనపై రుద్దక తప్పదు. అంటే భారతదేశములో ఫెడరేషన్ అమలు జరుపుట బ్రిటిష్ ప్రభుత్వపు యుద్ధ ప్లానులలో ముఖ్యమైనది. ఈవిధంగా యిప్పుడు వెచ్చే బిల్లూ, ఫెడరేషనూ ఒకే. ఆశ యొక్క వేర్వేరు ప్లానులు. అందుచే ఫెడరేషన్‌ను వ్యతిరేకించుటకు ఎట్టి ప్రతిష్టంభన, పోరాటాన్ని సాగింపనున్నామో యీ బిల్లుకు వ్యతిరేకంగా కూడ అంత పోరాటాన్ని మనం, శాసన సభల ద్వారానూ, ప్రజలలోనూ కూడా సాగించాలి.

ఇందు కొరకు కాంగ్రెసు అధ్యక్షుడు ఒక అఖిలభారత దినము నిర్ణయించాలి. ఈలోగా సభలు, ఊరేగింపులు భారత ప్రజాశక్తిని ప్రతిధ్వనింప జేయాలి. ఈ వాతావరణం కలుగజేయుటకు సోషలిష్టులు, కమ్యూనిష్టులు ఐక్యతతో కాంగ్రెసు రైతు-కూలీ ప్రాథమిక సంఘాల ద్వారా ప్రజా సామాన్య మంతటికీ యుద్ధాల వల్ల వచ్చు నష్టాలు, తెలియజేస్తూ యీ బిల్లు ఎటుల ప్రజా కంటకమో తెలియజేయాలి.

యుద్ధవ్యతిరేకప్రచారం ఆపే నూతన బిల్లును నాశనం చేయాలి!

కాన్‌స్టిట్యూయెంటు అశెంబ్లీయే

భారత రాజ్యాంగాన్ని నిర్ణయించాలి.

# ఆంధ్రరాష్ట్ర విద్యార్థి మహాసభ, బెజవాడ.

ఆంధ్ర దేశమునందు అనేక పట్టణముల లోను, పాఠశాలలలోను, అనేక విద్యార్థి సంఘములున్నట్లు తెలుస్తోంది, కాని, అందులో చాలావరకు ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషనుతో సన్నిహిత బాంధవ్యమును కొనుటకు ప్రయత్నించినటుల కనిపించుటలేదు.

అందుచేత పై మహాసభను సంబంధించిన విజ్ఞప్తులు గాని, ప్రకటనలు గాని పంపుటకు మాకు చిరునామాలు దుర్లభముగా నున్నవి. కావున, ప్రతి విద్యార్థి సంఘ కార్యదర్శియు, విద్యార్థి ఉద్యమాభిమానులును, తమ తమ చిరునామాలను మా కార్యాలయానికి వెంటనే పంపించాలని మా విన్నపము.

ప్రచురణ శాఖాధిపతి,
రామచంద్రరావు బి. ఏ.,

★

## నోటీసు.

గుంటూరు జిల్లా కాంగ్రెసు సోషలిష్టు పార్టీ కార్యనిర్వాహక వర్గ సమావేశము తెనాలిలో పార్టీ ఆఫీసునందు ఆగష్టు 21 వ తేదీన మధ్యాహ్నం 1 గంటకు జరుగును.

ఎజండా

1 రిపోర్టు

2 ఫెడరేషన్, రాబోవు యుద్ధములను గురించి ప్రతిఘాతక ప్రచారము, ర్యాలీ (Rally)

3 కాంగ్రెసులో మెంబర్లను చేర్చుట, అందు గురించి షార్టు తరఫున కరపత్రము

4 నవశక్తికి విరివిగా చందాదార్లను చేర్పించుట, డబ్బు వసూలు చేయుట.

5 కూలీ ఉద్యమము.

6 కిసాన్ ఉద్యమము.

7 వ్యవసాయ కూలీ ఉద్యమము.

8 జిల్లా యువజన సంఘ పునరుద్ధరణ.

9 పార్టీ డబ్బు.

10 కార్యదర్శి ఇతర తీర్మానాలు

మెంబర్లు, ఎక్సు అఫీషియో మెంబర్లు, తప్పక రావలయును. ప్రతి మెంబరు రెండు రోజులు ఉండుటకు సిద్ధముగా బయలుదేరి రావలెను.

ప్రతి కార్యనిర్వాహక వర్గ సభ్యుడు తాము చేసిన పనులను గురించి రిపోర్టు తయారుచేసి వెంటనే పార్టీ ఆఫీసుకు తప్పనిసరిగా అందచేయవలయును. ప్రతి మెంబరు కరపత్రములకు గాను రు 2 లు వంతున తీసుక రావలయును,

ఇట్లు,
15-8-38 శ్రీ గిరిరాజు సత్యనారాయణ.
నరసరావుపేట సంయుక్త కార్యదర్శి.

# కాళీపట్నం.

ఆగష్టు 12.

ఈ రోజు సాయంత్రం ఇక్కడి కాళీపట్టణ రైతుల విషయములో తీవ్ర కృషి చేసి, చుట్టుపట్ల గ్రామాదులలో ప్రచారం చేయుటకుగాను పశ్చిమ గోదావరి జిల్లా కాంగ్రెసు సోషలిష్టు పార్టీ, జిల్లా రైతు సంఘం, నర్సాపురం తాలూకా కాంగ్రెసు సంఘం తరఫున ఒక వాలంటీరు శిబిరము స్థాపింప బడింది. ఈ రోజు సాయంత్రం 7 గంటలకు బ్రహ్మాండమైన ఊరేగింపు బయలుదేరింది. స్త్రీలు, పురుషులు కలసి సుమారు వెయ్యి మందికి పైగా వూరేగింపులో పాల్గొన్నారు తరువాత గొప్ప బహిరంగ సభ జరిగింది. సభకు 2000 మంది హాజరైనారు. సభలో కామ్రేడ్ అల్లూరి సత్యనారాయణ. జొన్నలగడ్డ రామలింగయ్య, కలిదిండి బంగారం గార్లు ఉపన్యాసాలు చేశారు. ప్రజలంతా చాలా వుత్సాహంగా నున్నారు. తరతరాల నుండి తాము అనుభవించు చున్న హక్కులను తాము ప్రాణము పోయినా ఈ రోజు వదలిపెట్ట మనియు, జమీందారు తమను ఎన్ని యిబ్బందులు పెట్టినా ధైర్యముతో చివర వరకు అలసటి లేని యుద్ధంగా పోరాటాన్ని జయప్రదంగా సాగించుటకు సిద్ధముగా నున్నామనియు, ప్రజలందరు వాగ్దానం చేశారు. ప్రస్తుతం శిబిరంలో ఈ క్రిందివారు చేరి తీవ్రముగా ఈగ్రామంలోను చుట్టుపట్ల గ్రామాలలోను పనిచేయుచున్నారు. 1. అల్లూరి సత్యనారాయణ 2. కలిదిండి బంగారం 3. ఉద్దరాజు సూర్యరాజు 4. జొన్నలగడ్డ రామలింగయ్య. ఇంకా యితర గ్రామాలనుండి చాలా మంది వాలంటీర్లు త్వరలోనే శిబిరంలో ప్రవేశింపనున్నారు.

*

## గొల్లపాలెం

కాళీపట్టణ రైతుల ప్రచారం.

12 ఆగష్టు రాత్రి ఎనిమిది గంటలకు దేవాలయంవద్ద శ్రీ యాళ్ళ ఫీరాస్వామిగారి అధ్యక్షతను గొప్ప బహిరంగసభ జరిగింది. సభకు చాలమంది రైతులువచ్చారు. మొదట కలిదిండి బంగారంగారు కాళీపట్నం రైతులకు జమీందారుకి వచ్చిన పోరాటాన్ని గురించి విపులంగా తెలుపుతూ జమీన్‌దారు చేసిన అక్రమాలను బయటపెట్టారు. రైతులకు సర్వవిధాల తోడ్పడాలని తెలిపారు. ఆంధ్రరాష్ట్ర యువజన సంఘ ప్రధాన కార్యదర్శి కామ్రేడ్ అల్లూరి సత్యనారాయణగారు జమీందారులు రైతుల్ని బాధలు పెట్టుచున్నదీ ఒక కాళీపట్నంలోనే కాదనియు, అఖిలభారత దేశంలోనున్న జమీందార్లంతా ఏకమై రైతులందరినీ త్రొక్కివేయ చూస్తున్నారనియు ఈ జమీందార్లకు బ్రిటిషు ప్రభుత్వము మద్దతై వున్నదనియు, జమీందారీ విధానమూ, బ్రిటిషు ప్రభుత్వం రెండు కూడ పోయినగాని రైతులకు, కూలీలకు సుఖము లేదనియు స్వరాజ్యమునకై పోరాడుట ప్రతి భారతీయుని విధి ధర్మమనియు కాళీపట్నపు రైతులు తమ తరతరాలనుండి అనుభవిస్తూ వున్న భూమిని జమీన్‌దారు ఈనాడు కాజేయ జూస్తున్నారనియు రైతులు సాగించే పోరాటానికి ప్రతివారూ సహాయపడాలనీ చాలా గంభీరంగా వుపన్యసించిరి.

శ్రీయుత జొన్నలగడ్డ రామలింగయ్యగారు. భాగ్యవంతులు. జమీందారులు తమ స్వార్థము కొరకు ప్రభుత్వాన్ని అండజేసికొని ప్రజలను పీడిస్తున్నారనియు పీడతనం దేశములో విపరీతంగా పెరిగి పోతుందనియు యిట్లు సాగనిచ్చేటట్లయితే ప్రజలింకా అధోగతిపాలై పోతారనియు గాన వెంటనే రైతులు మేల్కొని సంఘాలుగా ఏర్పడి పీడించే వారి నెదుర్కొనవలెననియు అప్పుడే సంపూర్ణ స్వరాజ్యము లభించుననియు విపులముగా ప్రసంగించిరి. తదనంతరం ఉపన్యాసకుల వందనసమర్పణముతోను, జై కేకలతోను, సభ ముగిసెను.

కలిదిండి బంగారం,
ప్రచురణ కార్యదర్శి

★

## అస్సాములో వరదలు.

అస్సాం రాష్ట్రంలో బ్రహ్మపుత్ర నది వరదలవల్ల అనేక గ్రామాలు పాడయినవి. సస్యాలు పోయినవి. నిలవచేసుకొన్న ధాన్యం నీట గలసింది. వేలకువేలు ధననష్టం కల్గింది. సుమారు 5 లక్షలమంది నానా బాధలు పడుచున్నారు.

వీరికి సదుపాయం చేయుటకు వేలకు వేలు కావాలి. గాన ఎవరికి వీలైనది వారు అస్సాం ప్రజలకు సహాయం చేయకోరుచున్నాము, కాంగ్రెసు కమిటీలు, సుహృదయులు. చందాలు వసూలుచేసి ధనం యీదిగువ అడ్రసుకు పంపవలసినదని కోరుచున్నాము.

అడ్రెసు:—
బిష్ణురామ్ మేధి
అధ్యక్షులు
అస్సాంరాష్ట్ర కాంగ్రెసు సంఘం
గౌహాతి.

